# చైతన్యకవిత

**2**

అక్షయ శరత్తు

AUTUMN 1986



సంపాదకులు

తంగిరాల సుబ్బారావు

ఆర్వీయస్. సుందరం



**చైతన్య కవితా వేదిక**

**బెంగుళూరు**

CHAITANYA KAVITA a journal devoted to Telugu Poetry
published by Chaitanya Kavita Vedika
R-2, Jnanabharati, Bangalore University Campus, Bangalore-56
October 1986, pp. viii + 76.

ముఖచిత్రం : 'ఫిడేలురాగాల డజన్' పలికించి, 'కయిత నా దయిత' అని ప్రకటించి, 'పన్‌వాంగం' ప్రవచించిన ప్రయోగకవి పఠాభి.

ఫోటో : నవరోజ్ కంట్రాక్టర్, బెంగుళూరు

వెల : రూ. 8–00 (వార్షిక సభ్యత్వం రూ. 10-00; ప్రత్యేక సభ్యత్వం రూ. 100–00; జీవిత సభ్యత్వం రూ. 200-00)

*For Copies* :

**Dr. T. V. Subba Rao**
Department of Telugu
Bangalore University
Jnana Bharati, Bangalore-560 056

**Dr. R. V. S. Sundaram**
Department of Teluug
University of Mysore
Manasagangotri, Mysore-570 006



ఈ శరత్సంచికకోసం తమ ఇష్టదైవం శ్రీరామచంద్రమూర్తి పేరిట 1500 రూపాయల భూరి విరాళాన్ని ఇచ్చిన సరసులు, సహృదయులు, సారస్వత ప్రియులు అయిన శ్రీ సకలా నరసింహులు శ్రేష్ఠి (ప్రతిభా జ్యూయలర్స్, బెంగుళూరు)గారికి కృతజ్ఞతా పూర్వక నమస్సులు



ముద్రణ :
మిత్ర ప్రింటర్స్, విద్యారణ్యపురం, మైసూరు-8.

# అక్షయ శరత్తు

'చైతన్య కవిత' అక్షయ వసంత సంచిక మే 3 వ తేదీని మైసూరులోని ధ్వన్యాలోకంలో ఆచార్య యస్వీ. జోగారావుగారిచేత ఆవిష్కరింపబడింది. ఆనాటి సభకు జగద్విఖ్యాత ఆంగ్ల సాహిత్యవేత్త ఆచార్య సి. డి. నరసింహయ్యగారు అధ్యక్షత వహించారు. మొట్టమొదటి సంచికను ప్రశంసిస్తూ కవులూ పండితులూ విమర్శకులూ లేఖలు వ్రాశారు (ఇద్దరు ముగ్గురు తిడుతూ కూడా వ్రాశారు). పొగడ్తలకు పొంగిపోకుండా, తెగడ్తలకు క్రుంగి పోకుండా మేం ముందుకు సాగుతున్నాం.

"రాజకీయాలకు, పాక్షికాభిప్రాయాలకు, అర్థంలేని పంథాలకు లొంగకుండా భవిష్యత్కవితా స్వరూపాన్ని నిర్ణయించుకోడానికి" ఈ కవిత్వపత్రిక ప్రారంభించామనే మా సంపాదకీయ వాక్యాన్ని ఒకరిద్దరు సమీక్షకులు తప్పుగా అర్థం చేసుకున్నారు. కవిత్వంలో రాజకీయాలు ఉండవనీ ఉండకూడదనీ మా అభిప్రాయం కాదు. సాంప్రదాయిక కవిత్వం, భావ కవిత్వం, అభ్యుదయ కవిత్వం, విప్లవ కవిత్వం అనే భేదాలు లేకుండా అన్ని రకాల కవితలకూ వేదికను కల్పించాలని మా తాపత్రయం. రచనలో కవితాంశ ఉందా లేదా అని పరిశీలించడం వరకే మా పని. రాజకీయాలకు లొంగడానికీ, రాజకీయాలను కవిత్వంగా మలచడానికీ భేదం ఉందని మా అభిప్రాయం.

తెలుగు కవిత్వంతో బాటు దేశ దేశాంతర కవితలకు అనువాదాలను కూడా ఇవ్వడం వల్ల ప్రయోజనం ఉంటుందని భావించాం. మన ఇరుగు పొరుగు కవితలతో బాటు కొన్ని ఖండాంతర కవితలు కూడా ఈ సంకలనంలో చోటు చేసుకున్నాయి.

సుప్రసిద్ధ నవ్యాంధ్ర కవి శ్రీ పఠాభిగారి ఆలోచననుసరించి, శ్రీ బుల్లా సుబ్బారావు, ఐ.ఏ.యస్., గారి ప్రోత్సాహాన్ని స్వీకరించి చైతన్య కవితను అక్షయంగా నడపడంకోసం ఒక ట్రస్టును ఏర్పాటు చేసి, నిధులు సమకూర్చడానికి కూడా ప్రయత్నాలు చేస్తున్నాం. దీనికి 'చైతన్య కవితా వేదిక' అని పేరు పెడుతున్నాం.

ఈ చైతన్య కవితను తెలుగు కవుల సంఘంగా భావించి, అందరు కవులూ కవితాభిమానులూ ముందుకు వచ్చి జీవిత సభ్యులుగా చేరి చేయూత ఇస్తారని నమ్ముతున్నాం.

సంపాదకులు

పతాభ్యుక్తులు

"నాకు విచిత్రంబగు భావాలు కలవు
నా కన్నులందున టెలిస్కోపులు
మయిక్రాస్కోపులున్నవి....
అనుసరిస్తాను నవీన పంథా; కానీ
భావకవిన్మాత్రము కాన్నే, నే
నహంభావకవిని"

—ఫిడేలు రాగాల డజన్

"మన జాతిలోని సవర్ణ వివాహాలు,
సువర్ణ వివాహాలు పోవాలి"

"రెక్కాడితేగాని
డొక్కాడని వాడు రైల్వే
సిగ్నలర్"

"ట్యూబు బేబీలు వచ్చాక
మాతృత్వంలోని మహనీయత
గాజువారింది"

—పతాభి పన్చాంగం

## జాబిల్లి

అనవసరమగు అరసున్న,
గుఱ్ఱపులాడాము, గిల్లి
వేసిన గోరులాగ, సన్న
గిల్లియున్నది జాబిల్లి.

ఆకసమున అచ్చు తప్పు,
తెల్లవారు జాము కొవ్వు
వత్తి కొరవ, నింగి కొప్పు
లోని సన్నజాజి పువ్వు.

పిడిలేని కొడవలి, ఒక్క
ఈక, కుక్కతోక, పగిలి
పోయిన చేగాజుముక్క,
చదలు జబ్బ చక్కిలిగిలి....

—కయిత నా దయిత

# చైతన్య కవితా విలాసం

"ఉదయం కానే కాదనుకోవడం నిరాశ
ఉదయించి అట్లానే వుండాలనుకోడం దురాశ"

—కాళోజీ

## దివాకర్ల రాజేశ్వరి

### అక్షయ శరత్తు

ఈ జమ్మివృక్షాన
నిస్త్రాణమైన శస్త్రాస్త్రాలు
సమయం వచ్చినపుడు
రగులుకొనే అగ్నిఖండాలు.
రోషం దిగమ్రింగిన
ద్రౌపది
హృదయ విస్తారిత ప్రతీకార వాంఛలు
శమీ శాఖల సమీరణాలు.
క్రౌర్యం కౌరవుల్లా
రాజ్యం చేసినపుడు
అవినీతి
దుశ్శాసన శిఖరాల నందుకొనినపుడు
నరునకు
పరమాత్మ ప్రబోధంలా
పరచుకొంది
చెట్టుక్రింద నీరెండ.

గీతా సంపాదకీయాన
సీమను తాకిన
శమక్షమాలు
కర్తవ్య రూఢమై
పట్టిన విజయపతాకలా
మెరిసింది
బంగారు తరువుపై
అక్షయ శరత్ జ్యోత్స్న.

## సమయ చుంబనం

ఈ ఉదయం
అనంత చక్షువులు
ఆనంద బాష్పాలు కురిసినట్లు
అరవిరిసిన
నందివర్ధనాలపై
నవనీర కాంతులు.
ఈ ఉదయం
ఆశలు పెదవులు విప్పి
అందంగా నవ్వినట్లు
విచ్చుకొన్న మందారాలపై
అరుణ పరాగాలు.
ఈ ఉదయం
ప్రతి గుండెకు
పంచిందొక క్రొత్తకిరణం.

అమ్మ కడుపులోంచి
పుడమి ఎదపై
తలనూనిన నాటినుంచి
తప్పని సరిగా వచ్చే
ఉదయం.
నా భుజాల మీదుగా
గడియారాలెన్ని నడిచి పోతున్నా
నా మస్తిష్కాన
చందమామలు
పుట్టి పెరిగి
కృశిస్తున్నా
నేను మాత్రం
వెరిగిపోని
సరిక్రొత్త సమయాన్ని
చుంబిస్తున్నా.

చైతన్య

# మాదిరాజు రంగారావు

## అగ్నిభుజాలపై పంజాబ్

1

మనిషి ఎంత దగ్గరలో ఉన్నా
అతని హృదయ స్పందన కన్నా
ఎంత దూరం నుండో వినిపిస్తుంది బాగా
ఆయుధం భయపెట్టే ధ్వని తరంగం
ఎప్పుడు బడితే అప్పుడు వెనుకనే సాగివస్తుంది
వీథిలో బడిలో కార్యాలయంలో ఇంట్లోనూ
జొరబడి దీర్ఘ దీర్ఘమైన నీడలతో మృత్యువు.

2

అస్తిత్వాన్ని ఆలయ శిఖరంపై వదలేసి
ఆత్మను ఆకాశ హృదయంపై విసరేసి
ఆలోచనల్ని ఆయుధ పంక్తితో సిద్ధంచేసి
జ్ఞాతాజ్ఞాతంగా దూసుకుపోతున్నాయి ఉగ్ర శిఖలు.
అక్కడక్కడా నెత్తురు చుక్కలు మినహా
నేలపై వెలుగులోనూ ఏ జాడ కన్పించదు.

3

ఒక రక్తచిత్రం ధూళిలో కలసిందో లేదో
దాని స్థానంలో అగ్నిదృశ్య మవతరిస్తోంది.
ఆ నడచే ముఖాల్లో ఉన్న ఒకటి రెండు పూలే
వాడిపోయి వాలిపోయాయి రేకలు ముడుచుకొనీ.
ఆధునికత ఆటవికత చెరొకవైపునుండీ
లాగుతున్నాయి ఈ ప్రదేశంలో జీవితాన్ని
ఒకటి మార్పులోకీ, మరొకటి సంక్షోభంలోకీ.

4

పిడికిట్లో నిండిన ఆకాశంతో
ఆకాశంలో దాగిన సూర్యుని ప్రభతో,
భయంతో స్తంభించిన వాతావరణాన్ని
మెల్లగా చీల్చుకుంటూ నడుస్తున్నాడు సామాన్యుడు.
శాంతి సహన జీవితం మహాజన సమ్మతమైనా,
కాలం స్వప్నంవలె ఉంది, అశాంతి సముద్రమై,
వెలుగూ లేక పోలేదు అనలగణ పరీవృతమై.

5

ఇక్కడ తమ్ములూ చెల్లెండ్లూ వేసేవి
ఆకలిలో ఎగసే కేకలు కావు
ఆకలి తీరాక మెరపులవలె విసరే ప్రశ్నల
వెంటనే పిడుగులవలె విరుచుకపడే నినాదాలు.
కదలే పీలికలవలె నీడల ముఖాలతో
మండే కుంపటివలె నిప్పుల గుండెలతో
కౌటిల్యమూ ద్వేషమూ అస్థానోపగత మైంది.

6

కత్తిపోట్లూ తూటాలూ దూసిన
శరీరాలపై రాలుతూన్నవి కన్నీటి బిందువులు
గాయాల మంటల్ని శమింప జేస్తూ,
ఈ బిందువుల్లో అగ్ని ఎక్కడిది? ఆర్తి తప్ప.
ఉన్మత్త సముద్రం వలె తిరుగుతోంది
సజీవ హత్యాకాండతో చపలాదర్శం.
ఏ సిద్ధాంతమూ లేదు, ఏ ఔచితీ లేదు.

7

ఏ మహాత్ముని నీడ కూడా సోకేందుకు
సందులేని నిశారహస్యదహన గతితో
ఎద ఎదకూ మధ్య ఎడారులు పరుస్తూ
ఎద ఎదలో పిడుగుల్ని రువ్వుతూ,
ఉంది ఒకే ఒక స్వప్న బింబం మూర్తియై
ఇనుప కవచంతో రక్త నేత్రాలతో
పిడికెడు మనుషులతో సంఘటిత శక్తియై.

## 8

సమాధులనుండీ శ్మశానాలు దాటీ
అక్కడక్కడా చెదరి పడిన ఎముకలపై
అడుగులు పడుతూ పరుగెత్తుతోంది నేలపై
హింసతో హత్యలతో భగ్నమైన స్థితిలో,
ఏ ఉదార మేఘమో కరుణిస్తే తప్ప మతిలో
ఏ శాంతి సమయమో పరిక్రమిస్తే తప్ప హృదిలో
పచ్చదనం బ్రతికి పరిమళం నిశ్వసించేనా?

## 9

చివురునుండి ఫలము అన్నీ ఉన్నాయి అమరికతో
అయితేనేం? ఈ చెట్టు క్రింద వేసిన మంటల సంగతి?
నేలలో వేళ్ళు పాతుకొనీ బలంగా లోతుగా
పై కెగసీ ఎక్కడికో పారిపోడానికీ వీల్లేదు
ఇప్పుడు ఈ చెట్టునుండి—
చివురూ పండ్లతో ఖండించిన కొమ్మనులాగి
మరోచోట పాతాలని ఉగ్ర శక్తుల ఆరాటం.

## 10

నేలపై ఇంకిన నెత్తురు తడినుండి
"కొత్త చెట్టు"ను మొలకెత్తించాలనే ఆశతో
"అమృత సరస్సు"లో అగ్నివీచీ సంచరణం
"జప్‌జీ" హృదిలో ఆయుధాగ్ని సన్నాహం!
ఎంతో కాలం ఉండదీ అగ్ని భుజాలపై పంజాబ్
నిలుస్తుంది అమృత సరస్సులో మానవతా మధుతేజం
ఎగురుతుంది జప్‌జీ హృదిలో స్వర్ణశాంతి కపోతం!

## ఆసు రాజేంద్ర

### అంతర్ఘోష

వాళ్లు
నా బతుకు వివరకంటా
నన్ను నన్నులా నడవనిచ్చేలా లేరు
నిర్భయంగా
ఆకాశంవైపు దూసుకు పోయే
మహా వృక్షపు లేలేత చిగుళ్ళవంటి
నా లోని ఆలోచనలను
తుద ముట్టించాలని
వేళ్ల మొదల్లో విషాన్ని ఎరువుగా వేస్తున్నారు.

కంటక ప్రాయమైన
ఇరుకు దారుల్లో నడుస్తున్నా
యిసుమంతైనా వెరవని
నా వ్యక్తిత్వపు వెన్నుపామును
కనిపించని కమ్చీలతో బాది
లొంగదీసుకోవాలనుకుంటున్నారు.

నాలుక నిజంమీద ఈదుతుందని
కన్ను సత్యాన్ని పసికట్టే ఎక్స్‌రే అయ్యిందని
కాళ్లు చేతులు నూతన మార్గానికి
సోపానాలు వేస్తున్నాయని
నన్ను అవిటి చెవిటి మూగవాణ్ణి చేసేందుకు
విచ్చుకత్తుల్తో
నా నీడను పహరా కాస్తున్నారు.

వాళ్లు పెంచి పోషించే అవినీతి మందలో
నన్ను ఒక గొర్రెగా చేయాలని వాళ్ళ ఆరాటం.
నీతి నిజాయితీ

మంచీ మానవత్వం దారిలో నడిచిపోయే
నా పాదముద్రలు
వాళ్లకి భూతాలై ప్రేతాలై
భయభ్రాంతుల్ని వేస్తున్నాయి కాబట్టే
నన్ను వెంటాడి వేటాడాలనుకుంటున్నారు
నా జీవిత మహావృక్షాన్ని పెకలించి
ఒయాసిస్సు ఎరుగని ఎడారిలో
భూస్థాపితం చేయాలనుకుంటున్నారు.

ఎంత భూస్థాపితం చేసినా
నా వెనుక కోటిగళాలతో బుసకొట్టే
కొండంత పెనుగాలి బలం వుందని వాళ్ళకి తెలియదు
అది ప్రళయ ప్రచండ ప్రభంజనమై
కదలివచ్చి
తన రెక్కలపై నన్ను మోసుకెళ్ళి
సారవంతమైన నేలపై నిలబెట్టి
ఎప్పటికీ వాడని పచ్చదనాన్ని ఊపిరిగా పోసి
విజయకేతనం ఎగురవేస్తుందని
ఆ పిచ్చి వాళ్ళెరగరు.

## మంచంపట్టిన సూర్యుడు

పశ్చిమదిక్కు మీద
సూర్యుడైంది నా గుండె.
వెంబాడు వెంబాడు రక్తాన్ని
నేలపాలు చేసుకుంటున్నాను
చుట్టుముట్టుకొస్తున్న మబ్బులు
కన్నీళ్ళు కారుస్తున్నాయి.
ఏ లోయల్లోకి విసిరేయబడతానో
నాకే తెలియదు.
ఆశ
నా చమురు వత్తిని తీసుకుని
తూర్పువైపు పరుగులు తీస్తుంది.

# మిరియాల రామకృష్ణ

## సృజన

ఎన్నో పేజీలు రాశాను. వేలగంటలు కూచున్నాను. నక్షత్రాలు చూశాయి. వెన్నెల వేచి ఉంది. కళ్ళముందు నిద్ర కాచుకుని ఉంది. కాలం నడిచింది. గడియారం కదిలింది. సిందూరం కందుదలనిండా కమ్మింది!

నేను రాసిన ఏ పేజీ నాకు తృప్తినిచ్చింది? ఏ గ్రంథం (నేను రాసింది) నాకు నచ్చింది?

ఎందుకిలా రాస్తున్నా నిన్ని దినాలుగా ఇన్ని పుటలుగా ఇన్ని విచిత్రాలుగా ఊహల సముద్రాల నీదుతూ వేదనల ఆకాశాల నెగురుతూ బాధల ఎడారుల నేగుతూ సంతోషాల ఒయాసిస్సుల నాగుతూ.

ఎందుకీ కాగితాల శిఖరాల మీద కాంతి పతాకలు పాతాలనే తృష్ణ? ఎందుకీ గీతాల ధ్రువాల వద్ద మానవతను నిల్పాలనే ఆరాటం? ఇది అంతు లేని సృజన! అంతరంగ వేదన!

సాగుతుంది ఇలా నా జీవనపతాక ఎగిరి నన్నాళ్లు! ఎన్ని ప్రభంజనాలు వచ్చినా ఒరగనన్నాళ్లు!

** ** **

"నడిరేతిరిని మేలుకొన్నవాడెవ్వడు?
దివ్వెల నమ్మికలేమి, నీడల కుట్ర,
చీకటుల మెతకబుద్ధి, ఎవ్వరికెరుక?
గోరీలా అలికిడిలేని గదిలోపల
ఎందుకు పడినట్లా వెలుగు మరక?
గచ్చుమీద విచారాల పచారుల వల;
చిక్కిన పిట్ట ఎగురలేని గడ్డి పరక
ఎవ్వరి కర్థమౌతుందన్న?
తెల్లవారి మరొక ప్రొద్దు, ఏముంటుంది అంతకన్న......."

—బైరాగి

# శేషేంద్ర

## నీ కొడుకే నీ దేశం

పైసా ఖర్చు లేకుండా
కాళ్ళతో రైళ్ళతో పని లేకుండా
కోటాను కోట్ల గ్రామాలు తిరిగాను
మోటార్లు విమానా లెక్కకుండా
మూలమూలలా కన్నీటి
పుణ్యక్షేత్రాలు దర్శించాను
విఫలతా, జవాబులేని నిరాశా
అనే తీర్థోదకాల్లో మునిగాను
అరే! గ్రహించవేమి
నా కొడుకులోనే నా దేశమంతా
చూచాను!

## ఛాతీలో గుండె ఉంది

బేటా! వాణ్ని మాత్రం నమ్మకు
వాడు జెండా లెగరేసే దొంగ
నీళ్ళున్న చోటికే ఎగిరిపోయే కొంగ
అయినా భయపడకు!
నీ చేతిలో రాళ్ళున్నాయి
రాకెట్లు లేకున్నా
ఛాతీలో గుండె ఉంది
చేతిలో శతఘ్నుల్లేకున్నా....

# ఆకాశాన్ని చీల్చే పిడుగు

పారిపోయి గదిలో బంధించుకోకు
కుర్చీలు నవ్వుతాయి గోడలు
ప్రశ్నల్ని రువ్వుతాయి- పటాలు
ఉపన్యాసాల జలపాతాల్ని
విడుదల చేస్తాయి.... కర్ణస్ల జాజ్
సంగీత దండ యాత్రల్లో
నీవు కొట్టుకు పోతావు....
ఎందుకు నిరీక్షిస్తావు ఆ గదిలో
ఖైదీవై
ఏ ఉత్తరమూ నీ తలుపు కొట్టదు
ఈ దేశంలో వసంతం అడుగు పెట్టదు
ఎవడూ కోకిల గొంతు గుర్తు పట్టడు-
ఎందుకు అంత నాజూకు జీవితం మోస్తావు
నిన్ను కొలవడానికి ఒక్కోసారి
సముద్రం కూడా చాలదు
ఒక్కోసారి బిందువు క్కూడ చోటు చాలదు
నిరీక్షించు
నేను నీ కలంలోకి దిగుతాను
నీ కలల్లోకి దూకుతాను
నీ ఆకాశాన్ని చీల్చుకుని
పిడుగునై అవతరిస్తాను.

*　　　*　　　*

"....దేవుడు తన పార్శ్వంనుంచి ఒక్కొక్క
ముల్లు లాగుతుంటే రక్తపుటేరులు.
విధ్యుక్తంగా నీటి బొట్టు పెట్టి ఆమెను
ప్రేమతో ఆశీర్వదించాడు.
రతీదేవివి కా, వెళ్ళు, కామం ముడుపులు కట్టుకొని
నీ ఇంటి ముందు జనం జాతర
నిత్యం. బదులుగా నువ్వివ్వు నీ ఒంటి నెత్తురు"

—శ్రీ, ఆర్. ఎస్. థామస్

## కె. గోదావరి శర్మ

### షువకార్యం

కొత్త కాపురం
పచ్చటి ప్యార్‌డైజ్.
పొరుగు పచ్చ
ఓర్వలేని
విషప్పురుగు
లొకటా రెండా?
లోకమంతా
ఒక ఎర్రటి ఏపిల్,
యౌవనం ఈడెన్ వనం
మనం మానవులం.
ఆకలి, కామం మన ధర్మాలు.
అవి పాపం అనడం
వాడికి ధర్మం కాదు,
నోరిచ్చిన దేవుడు
కోరినవన్నీ ఇవ్వద్దూ?
అందాలు సృష్టించినవాడు
అనుభవిస్తే వద్దంటాడా?
అది దంపతులకి
మొదటి సారి
మగ పిల్లడు పుడితే
వాడు హంతకుడు కావాలా?

అయినా, పోనిద్దూ!
మన పద్ధతే
బాగుంది లెద్దూ!

కొంగు ముడి వేసుకొని
కొత్త దంపతులు
కోవెలకెళితే
గోడమీద బూతు బొమ్మలు!
కోవెల్లో శృంగార దేవతలు!
శీఘ్రమే సుపుత్ర ప్రాప్తిరస్తని,
వంశాభివృద్ధిరస్తనీ
అరిగిపోయిన రికార్డులా
పూజారి దీవనలు!
గర్భాదానానికి
గొప్ప హడావుడి!
గర్భం వస్తే
కొండంత పండుగ!
గర్భిణి స్త్రీ అంటే
ఎంత ఆదరం!
ఎంత అపురూపం!
మగపిల్లడయితే
వంశోద్ధారకుడు
ఆడపిల్ల 'అయితే'
ఐశ్వర్య లక్ష్మి!
బాలసారె పీటల మీద
కొత్త తల్లిదండ్రుల
అడ్డాల్లో బిడ్డ—
చేసిన ఘన కార్యానికి
దేవుడిచ్చిన
వరప్రసాదం కాదూ?

"ప్రపంచమొక పద్మవ్యూహం
కవిత్వమొక తీరని దాహం" —శ్రీశ్రీ

# జ్వాలాముఖి

## జీవనది

అదిగో నది అదిగో నది
కొండలగతాన్ని కోనల స్వగతాన్ని
మోసుక వస్తూన్న కరుణా జాహ్నవి
అదిగో నది అదిగో నది

పర్వతాల మౌనాశ్రువుల వెంట
జలజలా జారిన ఆ భావావేశం
కలల ముక్కలకింద చెదరినా
బెదరని సెలయేటి పోరుపాట
మందభాగ్యుల మందాక్రాంతాలకు
వర్షించే మేఘ మల్హార మాల
అదిగో నది అదిగో నది

దారుల్ని మూసినా దరుల్ని రాసుకుంటూ
గుండెలకు గుచ్చుకునే గులక రాళ్ళ మీద
చెదరిన కలల కాంతుల్ని ఏరుకుంటూ
శిశిరాలతో కలియబడే తేజస్విని
సుదీర్ఘ యాత్రల సుందర స్రోతస్విని
అదిగో నది అదిగో నది

బీడువారిన జనపదాల వాకిళ్ళలో
వాసంత వాగ్గేయకారునిలా నిలిచి
దుఃఖితుల రాగం తానం పల్లవిని
ప్రవాహ తంత్రుల్లోకి మళ్ళించిన
యుగయుగాల రాగోపజీవి
తూర్పు వాకిట మోగే మార్పు తంబూర
అదిగో నది అదిగో నది

ఆ కలల తిరణాల కదలి రాగానే
వెతలు వంపుకొని బ్రతుకు నింపుకొనే
అనాది పీడిత పిపాసువులకు
అమృతం పంచే రాగరాగిణి
మోళ్ళలో పూర్ణ పులకిత యామిని
తరగని తరుణ కిరణ గామిని
అదిగో నది అదిగో నది

ఆలయ విన్యాసపు అల్లరి నీడల్లో
నాగళ్ళు నరుని నేస్తాలై నడిచాయి
ఆ బతుకు పాటల పల్లవి వాడల్లో
కొడవళ్ళు నాగరికతలై ఆడాయి

అది పోరాటాల జీవనది
జడత్వాన్ని జల సమాధి చేసే
యుగ చైతన్యం అమ్ములపొది
దారి తప్పిన పల్లెటూళ్ళను
కదిలి రమ్మంటూన్న చైతన్యధార
కన్నీళ్ళను కత్తులుగా మారుస్తూన్న
జలవిద్యుత్ ఆయుధశాల

అదిగో నది అదిగో నది.

* * *

"కాలం రాల్చిన పండుటాకుల్ని
వసంత కాలపు జ్ఞాపకంగా
జేబులో పెట్టుకు తిరుగుతున్నాను
అయినా నా నరాల్లో అగ్ని చల్లార లేదు
వంచన అనే మంచులో—
కుంచుకు పోతున్న నాలో
త్రేతాగ్ని జ్వలిస్తోంది
చైతన్యాన్ని వరిస్తోంది"—దాశరథి

## కొల్లూరి

### నన్ను చివరిగా ఓదార్చే కొండంత మృత్యువు

నా ఆలోచనల్ని పంచుకుని
నా కన్నీళ్ళని, దుఃఖాన్నీ, చీకటిని, విషాదాన్నీ
షేర్ చేసే
కళ్ళు, దుఃఖం, చీకటి, విషాదం నాకు కావాలి
నేను మనుషుల్ని చదివాను
జీవితాన్ని పఠించాను!

అవకాశాలకి అనువుగా
కళ్ళకి దుఃఖాల కాటుక పులుముకునే
ఈ ప్రపంచం జనం మధ్య నేను బ్రతకలేను!
నేను, నాకంటె నాలుగడుగుల ముందు నా వేదన
ప్రపంచం నాకు దూరం కావాలి
నేను ఈ రొటీన్ ప్రపంచం గుండెల మీద
కాస్మొటిక్స్‌తో వేషం వేసుకోలేను
జీవితంరైల్లో సర్దుబాటు బొగ్గేసుకుని
కళ్ళల్లోంచి ఒక్కొక్కసారి చూపుల్ని పెరికేసుకుని
బ్రతికేస్తున్న ఈ వ్యవస్థను చూస్తున్న
నా నరాలు చిట్లి- రక్తం మౌనంగా బిగిసి
నా నిలువునా చావుకోర్కెలు జీవిస్తున్నాయ్!
నేను నేనుగా మృత్యువుతో కమిట్ అవుతాను
నాకు వ్యవస్థపై రోత
జనంపై ద్వేషం
నేనెందుకు పుట్టేనో నాకే తెలియదు
కానీ—
నాకు తెలిసిందల్లా ఒక్కటే
నన్ను చివరిగా ఓదార్చడానికి
కొండంత మృత్యువు తోడుందని!

## పులికంటి కృష్ణారెడ్డి

### విలువ

కండ్లు ఉన్నాయ్!
కండ్లల్లో నీళ్ళున్నాయ్!
వొళ్ళూ ఉంది
వొంటిలో చెమట ఉంది!
గుండెల్ని పిండితే కన్నీళ్ళు
కండల్ని పిండితే చెమట!
కన్నీళ్ళు నీళ్ళే
చెమటా నీళ్ళే
ఈ నీటి ఉత్పత్తి
చిత్రంగా జరుగుతున్నది ఒకే తనువులోనే!
అయితే-
నీ కోసం నువ్వు యేడిస్తే
కన్నీళ్ళు!
ఇతరుల కోసం నీవు శ్రమిస్తే
చెమట!
అందుకే-
చెమటకున్న విలువ
కన్నీటికి లేదు!

"నదులు కంటున్న కలలు పొలాల్లో
ఫలిస్తాయి
కవులు కంటున్న కలలు మనుష్యుల్లో
ఫలిస్తాయి"—శేషేంద్ర

## నిఖిలేశ్వర్

### చావును వెంటాడుతూ

మన వెనకాలే ప్రతిక్షణం నడిచే చావు
తన చంకలో మనల్ని
మడత పెట్టుక పోయే దాకా
అసలు పరిచయం కానే కాదు.
ముఖపరిచయం కాగానే
అసలు మిగలడానికి మనముంటే కదా?
చావుదేముంది–
ఈ దేశంలో ఈ రోజు దాని విలువెంత?
రైలింజన్ కింద నాణెంలా నలిగే ఆశ
నకిలీ సూది మందుకు
కట్ట కరచుకునే నిండు ప్రాణం
బస్సు వేగానికి కూలే జీవితం
కొండెక్కే కిరసనాయిల్‌లో బొగ్గు రూపం!

భూమికి దూరమై
భుక్తికి చేతులు చిన్నవై
నదిలోకి విసరబడే సజీవ మూర్తులు,
ఇథోపియా నమిబియాలలో
వెనక బడిన అనేక దేశాలలో
మనిషి పేరు ఆకలి
నల్లవాని రూపం అస్థిపంజరం!

ఆలంపూర్ శిథిలాల్లో పాములకే బలి పేదవాడు
రాయల సీమలో రాలని నీటి చుక్కలకు
కన్నీటి ఆవిరిగా మిగిలిన సామాన్యుడు.
కిరాయి చేతులు కాల్చే తుపాకులకు
కొండాపూర్ మెరక పొలాల్లో రైతుకూలీల మరణం,
ఎన్ కౌంటర్ల పేరు వినగానే

మన ముఖాముఖిన వుండే చావు కూడా విరగబడి నవ్వి
ఎదురు పడిన ఖాకీ దుస్తులను నిలదీసి మరీ చెప్పింది-
"కనీసం చావునైనా గౌరవించడం నేర్చుకోండి
లేక పోతే మీరే తిరిగి వెతుక్కోవాల్సి వుంటుంది
మనిషిలా జీవించే అవకాశాలను........"

"ఆహా, మన గోడల్ల మీద రాలిన ఆకుల నీడల కథ అపారమైంది. ఆ నీళ్ళు కలల నీటికంటె పరిశుద్ధమైనవి, అవి కలల నీళ్ళు కావు కాబట్టి అనంతానంత వందనాలు! వాచాలుని చపల బలిష్ఠ సముద్రంలాగా మన ఆత్మ చాలా కపటి! బలమైన వాసనలు మనల్ని చుట్టుముట్టాయి. వస్తువుల వాస్తవికత మీద కూడా మనకు సందేహం. అయితే మనిషీ తన దుఃఖానికే అంకితమయ్యేట్లయితే అతను వెలుగులోకి రావాలి! అంతే కాదు, నేనంటాను. అతన్ని హత్య చేయాలి. లేకుంటే
విప్లవం పుడుతుంది"

—ఫ్రెంచ్ కవి జాన్ పెర్స్

## బి. ప్రవీణ్

### రోడ్డు

వేకువ చేతులు చాచి
చీకటి దుప్పటి తొలగిస్తే
ఒళ్ళు విరుచుకుంటూ కనపడ్తుంది రోడ్డు.
బండివాడు విసిరేసిన ఇడ్లీ ముక్క
పనికుర్రాడు జార్చిన కన్నీటి టీ చుక్క
రోడ్డుకి అల్పాహారం.
ఫుట్‌పాత్ జీవితాలు
నిన్నటి పేపర్లో మంత్రి చేసిన
వాగ్దత్తాల్ని నిర్భయంగా కప్పుకుంటాయి.
రోడ్డు గుండెను నెక్కర్లో తొక్కి
అదనపు కండను తగ్గించుకుంటారు
సైకిళ్ళ పొదుగుల్లోంచి
పాలను వార్తలను పితుక్కుంటారు
రోడ్డు మీద
'ఇదే మందుల షాపు'ల బోర్డులు మొలుస్తాయి
పోలీస్ ఐలాండ్ల మీద రక్కసి గుండెలు వెలుస్తాయి.
వాహన తాడనం,
పాద చుంబనం,
రోడ్డు శీలంలేని పతివ్రత
జర్దా కిళ్ళీ మరక పుట్టు మచ్చలు.
రోడ్డు స్తన్యాన్ని పీల్చి ఓరాయి బలిస్తే
దేవతే వెలిసిందని మూర్ఖత్వం
పసుపు కుంకుమార్చనల కారం పూస్తే-
రోడ్డు డ్రైనేజీ కళ్ళతో ఏడ్చింది
దాని గుండెల్లో గునపాల్దింపి
మంత్రులకు స్వాగతం పలుకుతాయి

జెండాలు.
రోడ్డాక పెద్ద సోషలిస్టు
రూపాయి నోటుకూ చెమట బొట్టుకూ
పేవ్‌మెంటే సరిహద్దు.
నినాదం నల్లబ్యాడ్జి తొడుక్కుని
గుంపుగా సాగుతుంది.
యువత మంద ఎర్ర చొక్కాతో
ఖద్దరు గొర్రె వెంట పడుతుంది.
రోడ్డు నిండా లోయల లోతులు
"ఇది రహదారి కాదు" బోర్డులు
శిలా విగ్రహ గాంధీ నెహ్రూలు.
రోడ్డు ఆప్టిమిస్టు
అదెపుడూ ముందుకే సాగుతుంది
నగరకన్య నాభిని ముద్దాడి
నితంబము నల్లుకుని
త్రివళిని స్పర్శించి
పయోధరాలను తడిమి
నయాగరాలా గారాలు పోయే ఓణీ ఈ రోడ్డు.
కడుపు చీల్చి తీగల పేగులతో
రుద్రవీణ పాడే టెలిఫోనాసురులు
నిగిడిన నరాలు శూలాలై గుండెను కోస్తున్నా
ఫుట్‌పాత్ ఆమెను తల్లిలా ఆదరిస్తుంది.
ఆమె పుట్టినిల్లూ మెట్టినిల్లూ ఈ రోడ్డే.
రోడ్డు నిత్య గర్భిణి
జన ప్రవాహాన్ని వేదనతో ప్రసవిస్తూనే వుంటుంది.
రౌడీ చేతుల్లోంచి కాకి జేబులోకి
మారిన రూపాయికి
ఓ విప్రలబ్ధ ఒడిలోంచి జారిన పాపాయికి సాక్షి, ఈ రోడ్డు
చదవగలిగే కళ్ళుంటే
రోడ్డాక మహాకావ్యం
చూడగలిగే మనసుంటే
రోడ్డాక దివ్యదృశ్యం.

## దాశరథి

### కల్లోలయుగం

ఉచ్ఛ్వాస నిశ్వాసాలతో
ఉద్ఘోషిస్తూ పయనించే
కల్లోలిని మానవ జీవితం;
కాదనడం యెవ్వరితరం?
పరమాణువును ఛేదించడం
పరాక్రమమే- కాదనను
అణుశక్తిని అదుపులో పెట్టడం
అంతకన్నా పరాక్రమమంటాను
పిరికివాడు వెయ్యి యుద్ధాలు చేస్తాడు
ప్రతి యుద్ధంలో విధిగా చస్తాడు
ఆ పశ్చిమాకాశంలో
అంతటి యెరుపు
అలమటించే కోట్లాది
అమాయకుల అరుపు!

లంగాలూ లుంగీలూ అమ్మేవాడు
లక్షలు సంపాదిస్తున్నాడు
అక్షర లక్షలు చేసే కవితాధురంధరుడు
కుక్షి నిండక కుమిలిపోతున్నాడు!
వాతావరణ కాలుష్యం
వదిలించుకోవడం అవసరమే గానీ
రాజకీయ కాలుష్యం
రోజురోజుకూ పెరిగి పోతున్నది!
ఎముకలు భూగర్భంలో
ఎన్నో లక్షల యేండ్లుండి
బొగ్గై, అవల వజ్రమై
పొలతి కర్ణకుండలాల్లో మెరుస్తుంది

ఎక్కడి బొమిక?
ఎక్కడి బొగ్గు?
ఎక్కడి వజ్రం?
ఎంతటి చిత్రం?

కనిపించని మహాజ్యోతికి
కనిపించే బిరుదివ్వె సాక్ష్యం
కొవ్వొత్తి కొసలో సూర్యుడు
జవ్వని ముఖంలో చంద్రుడు
ఎక్కడో ఆకాశావకాశాల్లో
డొక్క నింపుకోడానికి పనికిరాని చుక్కలు
స్వేద బిందువులు
అశ్రు బిందువులు
రెండూ లావణ్య సింధువులు!

బుర్రలో ముద్దు పెట్టుకొని
చుర్రుమనిపిస్తున్నారు కొందరు
సమ్మె చేసిన వాడికి గుద్దులు
సమ్మె చేయించిన వారికి గద్దెలు
ఏం విచిత్ర యుగం!
ఎంతగా మారింది జగం!
ఈ యుగానికి మనం తగం;
అయినా ఈ బ్రతుకు గద్దె దిగం!

* * *

"సదా అప్రమత్తులైన సరిహద్దు సైనికుల్ని లెక్క చేయకుండా
తుపాకి గురికి నేరుగా తిరుగుతుంది
ఒంటరి గాడిద;
అయితే నా సంగతి? ఓ దేశమాతా-
బహిష్కృతుడినైన నా సంగతి?
నీ ఆకాశానికి నా కళ్ళకూ మధ్య
వరసగా నిల్చున్న సరిహద్దు గోడలు"

—పాలస్తీన్ కవి జుబ్రాన్

# ఎస్. మునిసుందరం

## నగ్నసత్యం

సూర్యుడు కొండల నడుమ
ముందు జ్వలిస్తాడు
నవయుగాంకురం
అడవి ఒడిలో పెరుగుతుంది.
కురుక్షేత్ర విజయరహస్యం
పన్నెండేళ్ళ అరణ్యవాసం
ధర్మ స్థాపనకు
పాశుపతం అవసరం.

## నిజం

నాలో
ఒక మహానగరం నిద్రిస్తూంది
తెల్లవారి చూస్తే
బ్రతికున్నది నేనొక్కడినే.

## పాపం

వయసులో పైట జారినట్టు
జారిపోతూంది కాలం
రేపటి సంగతి తెలియని మనిషి
శూన్యాన్ని కెలుకుతున్నాడు
చివరికి
ఆరడుగుల నేలలో
ఒదిగి పోతున్నాడు.

# కీ. శే. దిగుమర్తి సీతారామస్వామి

## హిమాని

(భావసంవత్సర హేమంతర్తువునందు దిగుమర్తి సీతారామస్వామిగారు రచించిన "హిమాని" అను గ్రంథము, 358 మినీ కవితల సంహిత. ఇట్టి కావ్యము 1934-35 లోనే రచింపబడుట ఒక విశేషము. ఇంతవరకు ముద్రితము కాక పోవుట ఇతోధిక విశేషము. పదవీవిరమణ చేయకుండానే శరీర విరమణ చేసిన గురుమిత్రులు సీతారామస్వామిగారి కుటుంబ సభ్యులనుండి సేకరించి, ఇప్పటికైనను ప్రచురింపగలుగు చున్నాము

—ఆచార్య కొర్లపాటి శ్రీరామమూర్తి)

1

నక్షత్రము సాగరగర్భమున చేరుట సులభము–
శీకరము తారామండలమును జేరుట దుష్కరము

2

మెరుపులోని యందము నెమలికే తెలియును

3

శ్యామల మేఘములయందే చంచలకు శోభ–
భేదములందె మోదములు మోదములగును

4

వాయు చలనము లేక పుష్ప పరిమళము బయలు పడదు

5

తెల్లదనమున్నంత మాత్రమున రెల్లు పూవునకు
మల్లె పూవు స్థానము లభింపదు

6

తెల్ల తామరలో విహరించినను తేటికి తెలుపురాదు

7

ప్రసవము తనకు వృంత చ్యుతిని గలిగించు
పవనునకే పరిమళము గలుగ జేయుచున్నది

8

నువ్వు పూవులోని రసమొకటి
తేనెటీగలు కొంత తేనె జేసినవి
ప్రకృతి కొంత నూనె చేసినది

9

పడియలందే కప్పల బడబడ
పాథోధివైపవి చూడనే లేవు

10

మేఘాకృతి గాడ్పుచే చెదరినను
మేఘరసముమారదు

11

స్వాతి వాన వినుకులన్నియు
మంచి ముత్యము లగుటలేదు

12

కొమ్మలు లేని చెట్లపై పక్షులు
గూండ్లు కట్టుకొనవు

13

ఇనుని తీక్ష్ణ కాంతి
ఇందుని యెడ సౌమ్యకాంతి యగుచున్నది

14

గానుగు చెట్టున కుండు శోభ
గంధపు చెట్టున కుండదు

15

విష్కలంక తారకా కోటికన్న
సకలంక చంద్ర రేఖయే రాత్రిని
జ్యోత్స్నకరింపగలదు

16

గులాబీలో పడిన హిమకణము ఘుమఘుమలాడును
పచ్చికలోని మంచు బిందువు పసరు కంపు కొట్టును
సూర్యకాంతిలో రెండును సురిగిపోవుటొక విధమే

# తంగిరాల సుబ్బారావు

## నడచి వచ్చిన దారి

(1978 లో మొదలు పెట్టి 1986 లో ముగించిన 'జీవిత భారతం' అనే నా సుదీర్ఘ కావ్యంలో 'బొమ్మ' అనే పేరుగల ప్రథమ సర్గలోని కొన్ని గేయాలు)

1

తొమ్మిది నెలలు
నెత్తుటి మడుగులో
ఆఖరికి ఒడ్డున పడ్డాను
చీకటి తెరలు చీల్చుకొని
వెలుతురు గుమ్మంలో నిలుచున్నాను
కొత్తగాలి
వింత కాంతులు
చిత్ర వాసనలు
విచిత్ర ధ్వనులు
ఉక్కిరి బిక్కిరి
నా చిన్ని కళ్ళకు మిరుమిట్లు
ఆకలి
ఏదో తెలియని బాధ
క్యారు క్యారుమని ఏడ్చాను.

2

"మగపిల్లాడు!"
మంత్రసాని అరుపు
"మొహమేదీ? కనబడ్డం లేదే?"
పురిటి నొప్పుల రొట్లో
మెత్తగా చితగ్గొట్ట బడిన అమ్మ
ఆత్రుతగా అడిగింది
ముఖాన్ని మూసి వేసిన

పట్టు కుచ్చులాంటి బారెడు జుట్టు
తొలగించి చూపింది మంత్రసాని
పనస పండులాంటి పసి పిల్లవాడి ముఖం
అలసిన అమ్మ కళ్ళల్లో
ఆనందం వెల్లి విరిసింది
నా మీద వెన్నెల వాన కురిసింది........

3

తాటాకుల యిల్లు
సంసారం కప్పులో పేదరికం చిల్లులు
కష్టాల వాన........
పితామహ క్రూర మేఘుడు కురిపించే పిడుగులు
చిల్లుల క్రింద ఆశల గిన్నెలు పెట్టి
రగడల కాలరథాన్ని
ఓర్పుతో లాగుతూన్న
అమ్మా
నాన్నా
చేతకాని పసితనంతో
నేను!

4

దిగంబరంగా
స్వేచ్ఛగా తిరుగుతూన్న నేను
'గోచీ పెట్టుకో పంతులూ
లేకపోతే కొడతా!'
అని బెదిరించిన 'అబద్ధం'
'అబద్ధం' ఒక మనిషి పేరు
ఎంత నిజమైన పేరు!
ఎంత తాత్త్వికమైన పేరు!
హఠాత్తుగా అబద్ధం ఒక రోజున
అబద్ధమే అయిపోయాడు
శ్మశానంలో కాలిపోయి
తెల్లని పిడకల దొంతరగా మారిపోయాడు
అబ్బా!

మరణం
ఎంత భయంకరం!
'చావు' అంటే ఏమిటి?
'అబద్ధం'గా అయిపోవడమా?
నేనూ అంతేనా?
అందరూ అంతేనేమో....

5

చలి
చీకటి
చుట్టూ అడవి
పామరత్వం బురద
ప్రక్కనే పారుతూన్న అజ్ఞానపు పంట కాలువ
పిల్లల పిచ్చి అల్లరి
అమ్మ తిట్లు కేకలు
నాన్న వల్లిస్తున్న వేదం పనస
ముక్కు పొడుం ఘాటు
గుమ్మకొనే ఎఱ్ఱ శాలువా వెచ్చదనం
అన్నదమ్ముల ఆటలు పాటలు
అంగవస్త్రాల ముక్క వాసనలు
మాడి పెమ్మకట్టిన అన్నం
అవకాయ కమ్మ పెరుగు
గడ్డిలేక మాడిపోతున్న చూడి ఆవు
రైతుల నిర్లక్ష్యం
తల్లివంకవారి అభయం అప్యాయతలు
తండ్రి వంకవారి ఈర్ష్యాద్వేషాలు
నేపాళం కొమ్మ విరిచి
అమ్మని దొర్లించి దొర్లించి కొడుతూన్న
దుర్మార్గుడు జగన్నతాత
ఏడుస్తూ చూస్తూన్న
ఏమీ చేయలేని– నేను!

## 6

పసి పిల్లవాడుగా నా కళ్ళల్లో
గ్రుడ్డి అమ్మాయి పెళ్ళి జరుగుతూన్న ఆశ్చర్యానుభూతి
వచ్చీరాని జ్ఞానంతో బోధ్యంగా వింటూన్న హరికథ
చీకటి రాత్రుల్లో
చెరకుతోటలగుండా నడిచి వెళ్ళి
ఆశ్చర్యంగా చూస్తూన్న–
రంగురంగుల దుస్తుల,
ధగద్ధగల కిరీటాల,
దిక్కుల్లో పేరుకున్న నిశ్శబ్దాన్ని చీలుస్తూ
తారాజువ్వల్లా లేచే సుదీర్ఘరాగాల,
గయోపాఖ్యాన నాటకం!
ఆవు ఈనింది
ముద్దుల దూడ ముట్టెను
ముద్దు పెట్టుకుంటూన్న ఆనందానుభూతి!
కడుపు నిండుగా
తియ్యటి జున్ను తింటూన్న ఆత్మ సంతృప్తి!
వైశాఖ మాసంలో
చెరకు రసాల మామిడి పండు
చీకుతూన్న రసతన్మయత్వం!
దిస మొలతో
పంట కాలువలో పడి గంటల తరబడి
ఈతలు
రెండవ తరగతిలో
బడిలో నాకు బహుమతి
వటపత్రం మీద శయనించి
కాలి బొటనవ్రేలు నోట్లో పెట్టుకొని
పాలతిత్తిలా చీకుతూన్న
బాలకృష్ణుడు
ఎంత అందంగా చూస్తున్నాడు
నా లేత కళ్ళలో
ఇంధ్ర ధనుస్సులు వెలిగిస్తున్నాడు........

7

ఊరు వదలి పల్లె వదలి
ఎక్కడికో అడవిలోకి వచ్చిన వలస
హెూరున గాలివాన
చూడి ఆవుకి మేత లేదు
విరిగిపడిన బొప్పాయి చెట్ల
ఆకులు తింటోంది ఆకలితో
రాత్రంతా వీధి అరుగు మీద
అంబోతు రంకెలు.
ఇంట్లో
బిక్కు బిక్కుమంటూ మేము.
అమ్మ నాన్నను తిడుతోంది
తన్ను కానట్లుగా
సున్నాల పన్నం వల్లిస్తూన్న
నాన్న
కుండపోతగా కురుస్తూన్న
వాన........

8

ఆకాశం చిల్లులు పడింది....
నాతో ఆడుకునే రాజులపిల్ల
రామసీత చచ్చిపోయింది
శ్మశానానికి తీసుకుపోతున్నారు
అదిగో
ఊరికి ఉత్తరంగా అదే శ్మశానం
కచ్చికలుగా మారిన పేర్చిన పిడకలు
మధ్య మధ్య తెల్లటి ఎముకలు
అమ్మో, భయం!
మరణమంటే చెప్పరాని చెప్పలేని
భయం!

9

గుండ్రటి ముఖం
ఉంగరాల జుట్టు
తేనెకళ్ళు
పచ్చదబ్బపండులాంటి
దానిమ్మ గింజల్లాంటి పళ్ళు
ఎప్పుడూ నవ్వుతూండే ఎర్రటి పెదాలు
ఆఖరి తమ్ముడు జగన్నాథం
ఎంత అందంగా ఉండేవాడు!
ఉన్నట్టుండి జబ్బు వేసింది
అజీర్ణ విరేచనాలు
అడివిలాంటి ఊళ్ళో వైద్యుడేడీ?
పసిబిడ్డను చంకన బెట్టుకొని
నాలుగు మైళ్ళు నడిచి వెళ్ళి
పట్టణంలో మందిప్పిస్తోంది అమ్మ....
మా గుండెల చుట్టూ ముసురుకుంటూన్న భయం.

10

నాన్న వేదపన్నాలు వల్లిస్తున్నాడు
చుట్టూ ముక్కుపొడుం వాసన
వేసవిలో
మండే ఎండలో
రాచ ఉసిరి కాయలకోసం
పొలాల్లోపడి ఒకటే పరుగు
రాత్రి వెన్నెట్లో బంతి ఆట
పగలు
ఎండిన కాలువలో చెలమలు త్రవ్వడం
చల్లని యిసుక
తియ్యని నీరు
ప్రకృతి ఆశ్రమంలో
తొట్టి స్నానం
మట్టి వింత వాసనలు

కప్పగంతుల డైవింగులతో
చెలమ జలతరంగిణి
మహత్తర ఆనందంలో మునిగిన నా లేతమనస్సు
పొంగిన రంగుల ఉషస్సు! (సశేషం)

## కత్తుల బోనులో నా ఆత్మ

ఈ దేశం కత్తుల బోనులో
రెక్కలు తెగిన పావురంలా నా ఆత్మ.
ధనికుల వ్యాపారాల లాభాల కోట్లు తారామండలానికి
దరిద్రుల ఆకలి మంటల కుక్క బ్రతుకులు పాతాళానికి
'మ్రింగ మెతుకు లేకపోయినా మీసాలకు సంపెంగ నూనె'లా
అటామిక్ రిసెర్చీ, ఆటంబాంబూ, స్పూట్నిక్‌లూ, సెటిలైట్లూ
రక్తపానాసక్తులైన ఇద్దరు బ్రహ్మరాక్షసుల మధ్య చిక్కిన
మాలదాసరిలా అలీనరాజ్యాల మహోద్యమం
ఎప్పుడూ ఎక్కడో ఓ దేశంలో
ప్రజ్వరిల్లుతున్న యుద్ధాగ్ని హోత్రం
మధ్య ప్రాచ్యంలో
ఒకరినొకరు పీకలు నులుముకుంటూన్న
మహమ్మదు మామా, మనుమలూ,
లంకలో రావణ కాష్ఠంలోంచి
పదితలల జాత్యహంకార రాక్షసుడు లేచి
నంజుకు తింటున్న తమిళ కరకుట్ల కమురు కంపు.

మతం పేరుతో అప్పుడు నరక బడ్డ మా అమ్మ చేతులు
ఇప్పుడు గుండెకూ శిరస్సుకూ గురిపెట్టిన మెషిన్ గన్లకు వేయూతలు
ఎక్కడ చూసినా నిరక్షరాస్యపు ఓట్ల గొర్రెల మందలు
చుట్టూ పొంచివున్న డెమోక్రసీ తోడేళ్ళు
జాతిమతాలు వివిధ కులాలు నిత్యం దూసుకునే కత్తుల తళత్తళలు
ఏ వైపు తిరిగినా దురభిమానపు వేపరొట్టెలు చుట్టుకొని
కరాళనృత్యం చేస్తూన్న భాషామహమ్మారి డప్పుల చప్పుడు.

రిజర్వేషన్ పేరుతో శ్రీగంధపు బెట్లు నరికేసి
ముళ్ళ మొక్కలకు దోహదక్రియలు చేస్తూన్న అడవిరాముడు!
రోజు రోజుకూ దుర్భరమవుతూన్న సామాన్యుల బ్రతుకుల గతుకులు
డబ్బుతో కొనబడుతూన్న జ్ఞానప్రధాన విద్యలు
భూమ్యాకాశాలను ఆక్రమిస్తూన్న నిరుద్యోగ త్రివిక్రముడు
నీతి కుందేళ్ళను మ్రింగే లంచాల కొండ విలువలు
యువతుల్ని కాటువేస్తూన్న వరకట్నాల కోడె త్రాచులు
ఈ వినోద ప్రదర్శనాన్ని తిలకించి పులకించే
వికలాంగులు ఈ గడ్డమీది మేధావులు
విదేశాల ఋణభారాల ఎయిడ్స్ అంటుజాడ్యంతో
క్రుంగి పోతూన్న నా దేశాభ్యుదయం గ్రామదేవత
పాడు గుడి ముందు జరుగుతూన్న జాతరలో
గావుపట్టబడిన కోడిపిల్ల మొండెంలా
కొట్టు మిట్లాడే
నా అంతరాత్మ!

"ఈ రాత్రి అత్యంత దుఃఖ పూరితమైన వాక్యాలను రాయగలను.
నా దగ్గర ఆమె లేదు అనే ఆలోచన. పోగొట్టుకున్నాననే భావన.
ఆమె లేని ఈ అపారమైన రాత్రిని ఆలించు.
పద్యపాదం పడుతోంది ఆత్మమీద, పచ్చికమీద మంచు లాగా...."

—పాబ్లో నెరూద

# కేఎస్వీ

## రాత్రి

ఆకాశం కప్పులో
వెన్నెల పాలు తాగుతోంది ప్రకృతి
పరోపకారం చేసిన పాపానికి
మంచు స్నానంతో
శుచి అవుతున్నాయి చెట్లు
నదులు గలగలమని
కలగంటున్నాయి
పిచ్చివాడి కలలో
పువ్వులా విరుస్తోంది
ప్రపంచ శాంతి.

## పతా

రేకులు లేని పువ్వులు
నీటి నీడలలో
పాచిని మీటే చేపలు
పాపల నవ్వుల్లో
తెల్లని వెలుగులు
మైదానంలో ఇంకుతున్న
సూర్యరశ్మి
చర్మంలో జీవస్పృహ
తలుపువార మూలన ధూళి
విమానం రెక్కను వొరుసుకునే గాలి
డబ్బాలో చీకటి
సూర్యుడి వెనుక ఒయాసిస్
ఎడారిలో మెటఫిజిక్స్
అదీ నేను!

## పచ్చికల

రాత్రి కలలో
రెండు కత్తులు మొలిచాయి
రెండు నరకాలు ఢీకొన్నాయి
తల్లక్రిందులైన పారిజాతానికి
బంగారు పావురాలు పుట్టాయి
సముద్ర కెరటాల్లోంచి
రక్తాక్షులు దూసుకొచ్చారు
నీడలేని ఎండకాసిన వీధుల్లో
జనం పిడికెడు పరిమళాల కోసం
ఎగబడ్డారు
వంతెనలు కూలాయి వీణలు ఎగిరిపోయాయి
మామిడి చెట్లు మాధవీలతల్ని
విదిల్చి కొట్టాయి
రాత్రి కల సురిగి పోతుండగా
లోకంలో తలుపులన్నీ
ఒక్కసారిగా
తెరుచుకొని
మూసుకున్నాయి.

## అవును, కాదు

వంతెన క్రింద నీడ
గులాబీ ముల్లు మీద మంచు బిందువు
గుడి ముందు బిచ్చగత్తె
రావిచెట్టు క్రింద ఒమర్ ఖయాం
షాంపేన్‌లో కరివేపాకు
సెక్స్‌లో ఎక్స్
నక్షత్రం క్రింద టార్చ్‌లైట్
కలలో మరణం
అదీ నువ్వు.

# కీ. శే. దేవరకొండ బాలగంగాధర తిలక్

## కవివాక్కు

(1954లో రష్యా వెళ్ళి వచ్చిన శ్రీశ్రీ, భారతీయుల్ని కించ పరుస్తూ, రష్యావారిని కీర్తిస్తూ ఒక మాట అన్నారు. దానికి ప్రతిక్రియగా తిలక్ ఈ కవిత వ్రాశారు. దీనిని 1955 జనవరి 23 నాటి ఆంధ్రపత్రిక దినపత్రిక (ఆదివారం) ప్రకటించింది. ఇది 28 పాదాల కవిత. 1966లో తిలక్ మరణించారు. 1968లో విశాలాంధ్రవారు ప్రచురించిన 'అమృతం కురిసిన రాత్రి'లో ఈ కవిత లేదు. ఆ కావ్యానికి 1972 లో రెండవ ముద్రణ, 1976 లో మూడవ ముద్రణ వచ్చాయి. వీటిలో కూడా ఈ కవిత లేదు. 1984లో నాల్గవ ముద్రణ వచ్చింది. దీనిలో అన్నగారు ఆవంత్స సోమసుందర్ కొన్ని 'అసంపూర్తి అముద్రిత రచనల్ని' చేర్చారు. సంపూర్ణ రచనలలో భాగంగా 'కవివాక్కు' కూడా చేర్చబడింది. కాని దీనిలో రెండు, మూడు చరణాలు మాత్రమే ఉన్నాయి. మొదటి చరణం, నాలుగు, ఐదు, ఆరు, ఏడు చరణాలు తీసి వేయబడ్డాయి. అందువల్ల కవితా ప్రియుల కోసం, సత్యాన్వేషకులకోసం, పరిశోధకుల ఉపయోగార్థం పూర్తి గేయాన్ని యథా తథంగా ఇస్తున్నాను—తంగిరాల)

"భారత దేశాన్ని కాదనలేను
రష్యాదేశాన్ని కొలువలేను
నిజం ఎక్కడో అక్కడ నా ప్రాణం వుంది
హృదయం ఎక్కడో అక్కడ ఉదయం వుంది.

పులి చంపిన లేడి నెత్తురు పులుముకోలేను
ఖడ్గ మృగోదగ్రవిరావం ఆలకించలేను
జగద్ధాత్రి! నీ కుమారులమైన మేము
తత్త్వాలపేర విప్లవాల పేర ఒకరినొకరం హతమార్చుకోలేము!

శాంతికోసం యుద్ధాన్ని ప్రజ్వలింప చేస్తారు
సుఖం కోసం ఆరక్త విప్లవాన్ని తరింప చేస్తారు

శ్మశాన భూమిని వికసిస్తుంది వీరు నాటిన పూల చెట్టు
కాని ఎవరు తుడుస్తారు తల్లీ! నీ కన్నీటి బొట్టు.

ప్రభువులనే కిరాతకులకు అమ్మనన్నాడు బమ్మెర పోతన
పార్టీలకు అమ్ముడు పోయిన నేటి కవులకు లేదు వేదన!
మాటల మేజిక్కు నమ్మి, పాటల మ్యూజిక్కునీలో క్రమ్మి
మరచి పోకు అసలు వాణ్ణి నీ సోదరుడైన మానవుణ్ణి.

వంచలేను నా శిరస్సు ఏ అధికారం ముందు
ఒప్పలేను మానసిక దాస్యాన్ని ఏ ప్రభుతయందు
నాకు వద్దు మీ రంగురంగుల కాగితపు బురఖాలు
పాత వుచ్చులు తీసి తగిలించకు వినూత్న శృంఖలాలు!

ఒక సత్యం కోసం మరో సత్యాన్ని ఖూనీ చెయ్యకు
పరదేశ స్తుతిలో స్వకీయ సంస్కృతి విస్మరించకు
ఇంకా కరిగి నీరై పోలేదు హిమాచల శిఖరాలు
ఇంకా మరిచి పోలేదు తథాగతుని మహాత్ముని ప్రవచనాలు!

•

వివేకం లేని ఆవేశం విపత్కరమౌతుంది
సంయమం లేని సౌఖ్యం విషాద కారణమౌతుంది
సమ్యక్ సమ్మేళనము లేని తౌర్యత్రికం కఠోరమౌతుంది
కరుణలేని కవివాక్కు సంకుచిత మౌతుంది!

(ఆంధ్రపత్రిక సంపాదకులు శ్రీ శివలెంక రాధాకృష్ణగారి సౌజన్యంతో)

"ఇల్లులేని వాడు ఆకాశ క్రౌర్యానికి గురి
భూమి లేనివాడు ఆకలి కోరలకు బలి
మరణించే లోపుగా తన మాట చెప్పలేని
నిస్సహాయ మానవుడి గొంతుక పేరే కవి"

—శేషేంద్ర

# ఆర్. సీతారామారావు

## ఊదాపువ్వు

గది ఎప్పుడూ నిలబడే వుంటుంది
ఊదా మంటల్లో
గది ఎప్పుడూ వొంటరిదే—
గోడకి తగిలించిన ప్రేయసి
చిత్రపటాన్ని మంటలు భస్మం చేస్తూ
కలల్ని రాల్చేస్తూ
గదినిండా ఊదారంగు అలుముకు పోతుంది
ఊహలకి ఊపిరాడదు
వాటిని శిక్షించడానికి చేతులూ పొడుచుకురావు.
ఈ మంటల్ని ఆర్పాలి
కనురెప్పల చేదలలో నీళ్ళు విమ్మాలి
కళ్ళలోకి బకెట్లు దిగవు
రెటినా నూతుల్లో నీళ్ళూ లేవు
చౌరస్తాలో చెప్పుక్రింద చితికిన నెత్తుటి
ముక్క కంగారు పడ్డా తప్పించుకోలేదు.
అదే దృశ్యం కళ్ళలో సుళ్ళు తిరుగుతోంది
ఏ చిత్రపటం ముఖంలోకి తొంగి చూసినా
రంగుల అసమర్థతనే పలికిస్తాయి
ఊదామంటల్లో చిక్కిన క్యూలెక్స్ దోమలేదు
నా బాధని పీల్చడానికి
జీవించడం నేర్పే చిట్టి తల్లి చీమ
గోడమీద సజీవ శిలాజం అయిపోయింది.
గదిలో కన్నతల్లి చీకటి
ఊదామంటా ఇవే—
పంకా మాత్రం తల విసురుగా తిప్పటం మానదు.
మంటలు పెరిగే కొద్దీ సంతోషం పెరుగుతుంది పంకాకు
నన్నూ మంటలు తాకాలనే చూస్తాయి.

నేనో పెద్ద ఊదా అగ్ని పర్వతాన్నని వాటికి
తెలియదు.
లేత మాటల్లోకి ఒక కన్నీటి నెత్తుటి
బొట్టుని వొదుల్తా!
గుండె క్రింద స్వప్నంలో ఊదాపూలు విప్పుకుంటయ్
మంచు బిందువు రాలి సిగ్గులో ఊపిరి తీసుకుంటుంది.
చెప్పుల ముఖంలోకి చూడలేని పాదాలు
గదిని బహిష్కరించి వెళ్ళితాపొయ్ నగ్నంగా—
పాదాలు మే పన్నెండు అర్ధరాత్రుల
చీకట్ల మీద నడుస్తూ నర్తిస్తాయ్
ఇరానీ కెఫేల్లోని మిత్రుల అహాల్లోకి
చొచ్చుకు పోతయ్!
కళ్యాణ మంటపాల మీద కనుగుడ్లు దీపాలై
వెలిగినా
గుండెలో మృత్యువృక్షం ఆకులు రాల్చటం ఆపదు.
కాళ్ళకి అతికించిన జీవితం
ఆకాశానికి ఉరేసుకున్నట్లు
నిలబడి వున్న గదిలోనే
వ్రేలాడ్తుంది....వ్రేలా....డ్తుంది....!

"ఇదిగో జాబిల్లీ నువ్వు
సముద్రం మీద సంతకం వేసేటప్పుడు
గాలి దాన్ని చెరిపెయ్యకుండా
కాలమే కాపలా కాస్తుందిలే"

—శ్రీశ్రీ

# సోమసుందర్

## చేటుకాలమా! ఏలుకో....

ఏలుకో భయద రాత్రీ! ఏలుకో....
బలహీనుల్ని కులహీనుల్ని ధనహీనుల్ని
మూకుమ్మడిగా మ్రింగిన కులరాక్షసీ, ఏలుకో!
బ్రతికి బయటపడ్డ నలుగురూ
నీ పొలిమేరలు విడిచి దూరంగా పారిపోయారు;
నీకిక యిబ్బంది లేదు; నిర్భయంగా ఏలుకో!

దళితుల హృదయాలలోనా
జాగృతి కలగబోదింక! నిస్సహాయంగా
జమ్ముగడ్డి పనల్లా పడ్డారు నేలమీద....
దుమ్ములగొండులకీ జిత్తుల నక్కలకీ
తోడేళ్ళకీ బోలెడు జాగా ఏర్పడిందింక
హాయిగా రక్కసి మూకల్ని దింపుకో....
పగలూ రాత్రీ నిష్పూచీగా అంధత్వం ప్రసరించుకో
ఏలుకో నిరంతరాయంగా....
దాచుకో ధనరాశులు పాతాళ బిలంలో....
ఏకంగా ఒకటే చెదరని చెరగా, మరగా—
ఇష్టారాజ్యంగా.... మృష్టాన్న భోజనంగా...
అలనాడు మాలపల్లిని దర్శించిన
మహనీయుడు ఉన్నవ సృష్టించిన
పొగరుబోతు చౌదరయ్యలింకా—
చావలేదు, చావలేదని చాటుకో!
జనాలను ఒడ్డించుకొని, భోజనాలు
సజావుగా ముగించుకో! నీకేం భయం?
ఉన్నవ మహనీయుడేనాడో కాలం చేశాడు
ఆయన్ని ప్రోత్సహించిన విశ్వదాత ఎప్పుడో వెళ్ళిపోయాడు
నిన్నరికట్టే వాడే లేడు సాగిపో నిర్నిరోధంగా!
ఏలుకో భయద రాత్రీ, కులంధాత్రీ—ఏలుకో!

శ్మశానాల వైశాల్యాన్ని యథేచ్ఛగా
పెంపొందించుకో! గ్రామ సంపదనంతా
రాక్షసులందరికీ నిర్భయంగా పంచుకో
పోలీసుల కేముంది? కాసుకు బానిసలయ్యే కూళలు ...
బొరియలు వెదికే గుంటనక్కల ఊళలు....
రంగులు మార్చే ఊసరవెల్లుల సైదోళ్ళు
సందేళ సందులనక్కే ఎర్రటోపీల తేళ్ళు ...

లేగల నెత్తుకపోయే బిందుగులకీ తోడేళ్ళకీ
ఒంటరి బాటసారుల కెక్కిరించే వరడులకీ
లేడిపిల్లల నంకిట కరచుకుపోయే
పోతరించిన బిరుత పులులకీ—
నేడే ఆహ్వానాలు పంపుకో!
వసంతాలు జల్లుకో నరరక్తంతో
పసందుగా విందులు జరుపుకో ఏలుకో....
భద్రంగా కాపాడుకో పొదల విడిసిన నాగుబాముల్ని
కులరాక్షసుల మాయల మరాటీల ఏలుకో కాళరాత్రీ!

భయవిహ్వాల విషాద ధాత్రి
శోకార్ణవమై పొంగితే పొంగనీ,
ఈ ప్రజారాజ్యంనీకు పెద్ద అండ
మాయ జలతారు మెరుపుల దండ
నువ్వు ధరించినప్పుడే దానికి బ్రతుకు మనుగడ....
మేడిపళ్ళకీ, కీలుబొమ్మలకీ,
బొమ్మలాంతర్లకీ యికపై లోటు లేదు.
పగుళ్ళు తీస్తున్న నీ కులంకోటలు
లోలోపల కూలుతున్నాయన్న భయం లేదు
ఏలుకో భయదరాత్రీ ఏలుకో
ఏలుకో నిరంకుశాంధ తమస్వినీ ఏలుకో!
వరహీన దాంపత్యంలా సుఖంగా ఉంది దేశం
రసహీన కావ్యంలా ఆనందదాయకంగా ఉంది దేశం
బాజా బజంత్రీల ఆహ్లాద వర్తమానం దేశం....
ఆహా సర్వత్రా తెర విప్పిన ధూర్తహాసం.

అందుకే నీ మార్గం నిరాటంకం
కాకాసురుల పటాటోపాలకీ
పెత్తందారీ పొన్నుకర్రల తళతళలకీ
బోలెడు కాశీ ఏర్పడిందింక—సాగిపో
యథేచ్ఛగా సాగిపో నిష్కంటకంగా

అవును సుమీ, సజావుగా సాగుతోంది ప్రజాస్వామ్యం
ధనహీనుల బలహీనుల పీడితుల శవాల మీదుగా
హుందాగా సాగిపోతుంది సినీమాయాలోకం ...
ఓటు వేసి నెగ్గించుకున్నాం కదా, ఇంక పూచీ లేదు
నేల కూలిన యువకుని శిరస్సు ససేమిరా మాట్లాడదు
వెల్లిపోయిన చెల్లి మానం ఫిర్యాదు వేయదు
తలపగిలిన భర్త అపస్మారం సాక్ష్యం పలకదు
ఇంక నీ కులధాష్టీకాన్ని ఎదిరించే వారెవరు?
నీరవమై చెరువుగట్టు నిద్రిస్తోంది పలకదు
నీళ్ళోయించుకొన్న గేదె పెయ్యి హాయిగా సోలుతోంది
దిక్కులేని దిగంతాలు భయపడి ముడుచుకు పోయాయి
కకుబంతం నోరు మెదపదు; హోరు సలపదు.
నేల పొరలిన నెత్తురు పితూరీలు సలపదు....
నీకింక అడ్డులేదు, అపు లేదు, చూసే కన్ను లేదు.

నీ కోపాగ్ని జ్వాలలకాహుతియై మిగిలిన
దౌర్భాగ్య జనావాసల బూడిద—విభూతి కాదు
ఎప్పుడూ అది పాలకుల నిటలాల కెక్కదు....
రాక్షస భారాల పాదాలు మోసి మోసి
నీరసంగా నిస్త్రాణగా పవళించింది—
ముసలి ధరణి మూర్ఛ పడిందింకేం మాట్లాడ గలదు?
ఇదే అదను లేచిరా అజ్ఞాతవాస క్లేశాల పాపం
దుసికిల్లి పోతున్నావు—సాగించుకో రాక్షస పాలన
తుపాకి తూటాల గాయాలు సలపగా
మూలగకే యింక దళితధాత్రీ, మూలక్కు....
శోకోపశమన గీతం నీకు
వినిపించే వారెవరూ లేరిక్కడ....

భృశమై న్యాయం మాయమైంది
ఫలితం పరార్థమై అవాక్కయింది
జన చైతన్యం స్తంభించి పోయింది
దివారాత్ర చక్రబంధం క్రకచదంతంలా
ఒక్కటే జీవిత గమనమై సాగిపోతోంది.....
ఇదే మంచి తరుణం, సమయం మించిందా
అమృతమే హాలహలం. ఏలుకో హుటాహుటిగా
పెంచుకో భయవిహ్వల లోకాన్ని ఓహరిసాహరిగా
ఏలుకో కాళరాత్రీ, పరచుకో తామర తంపరగా....
పురాకృత తపఃఫలాల నన్వేషిస్తూ
రోదించకే బేలగా ఓసీ పుణ్యధాత్రీ!
పణ్యాంగనా విపణి వీధులలో
అంగరంగ వైభోగంగా నేడే
విహరిస్తాడు వీరభోగ వసంతరాయడు
నిముషాని కొక వేషం మార్చే బహురూప ధురీణుడు
కొలువు నిలుపుకో.... కైంకర్యం సలుపుకో
ఏలుకో భయద రాత్రీ–ఏలుకో
తల్లులు పల్లెత్తి పలకనంత కాలం
ప్రతివాడూ అగ్రకులం ఖాతాదారుడే
అందుకే, గుట్టు చప్పుడు కాకుండా ఏలుకో
నిశ్శంకగా.... నిర్లజ్జగా.... నిష్కంటకంగా.

(17 జులై 1985న అమానుషత్వానికి బలైపోయిన కారంచేడు సోదరులకు అంకితం)

ఏ. శ్రావణ్‌కుమార్

## మృత్యు చిత్రం

మనిషి పేరు చెప్పితే-
ప్రకృతి శివమెత్తి పోతోంది!
పెదాల మీద మాటలు
హృదయాలు కంప్యూటర్లు
'యుద్ధంకల' కళ్ళమీది రెప్పల్ని పీకేస్తోంది
భూమ్మీద విజ్ఞానం ప్రసవించిన అశాంతి శిశువు
అణుగర్భ విస్ఫోటనపు జరాయువు పొరల్లో దొర్లుతూ....
'మానవత గుండె' అణుబాంబుల మూటల మధ్య—
అడవి ఫలమై అఘోరిస్తూ...
వేదనా పర్వంలో—
శాంతి మరణ ఘడియల్లో
మానవశక్తి- మృత్యుగీతాల మోతల్లో
మోసుకు పోబడుతున్నది ప్రగతి!

## జీవితం

పుట్టుక శ్రమ ఫలితానికి
చావు ప్రతిఫలం అయితే
జీవితం—
పోరాటం!

# యస్వీ జోగారావు

## కాళోజీ

అన్నా కాళోజీ!
కరుణకు సున్నా చుట్టిన కాలంలో
కవితకు పెట్టిన కాలేజీ
లోకంలో గొడవంతా
'నాగొడవ'ని భావించే నానాజీ
బవిరిగడ్డం లేదుగానీ
బారెడు జడలు లేవు పోనీ
భావాల పుట్టలోంచి
భవ్యార్ష కవితాకృతిగా
బహిర్గమించిన బాబాజీ
కలంచేసే కసరత్తులతో
పదాల పటాలం దూసే కత్తులతో
కవితారంగంలో కవాతు చేసే కాళోజీ

అక్రమ విక్రమార్కులను హడలగొడతావు
నవ భావుకులను నవ్విస్తావు
ధర్మవీర దయావీర ధౌరేయుండవై
ఖలీల్ జిబ్రాన్‌లా కరుణ హాస్యరసాల
లవ్ మేరేజీకి లగ్నం పెడతావు
కార్పిస్తావొకకంట కన్నీరు
మాచే మరో కంట పన్నీరు

అసలు రసాల కవిత్వం కాదు నీది
అది ఎదిరి యెద టైరు బరస్టయ్యే
వాదస్తాన్ని రిటైరు చేసే
సెటైరు మసాలా కవిత్వం
కాదు కాదు నీది రసాల కవిత్వం
అవునవునది అభ్యుదయ భావాల బారసాల కవిత్వం

సహజ కవివి సమాజ కవివి
సదయ కవివి కాదేమో నువ్వు
కరుణ నిండిన అంతఃకరణంతో
అనుభూతి శ్రుతి లగించి బిగించి
అక్షరాక్షరంలో ప్రాణకళ ప్రతిష్ఠించిన
కవిబ్రహ్మ కల్పనా శిల్ప సంకల్ప శిశువ్వు
వట్టి మామూలు మనిషివి సుమా నువ్వు!

"ఎడమవైపు శవదహనం
కుడివైపు వివాహం

అయినా పడుకునే ఉన్నాను నేను
అచలంగా
రాయిలాగా

నా హృదయాన్ని
గలగల శబ్దాలలో
కడిగేసిన కలలకు
నేను
బెదరకుందునుగాక"

—పోలిష్ కవి గ్రోచోవియక్

# కందాళై రాఘవచార్య

## అద్దం ముందు....

నుదురుకు
రాయి తగిలి
మనస్సు అదిరిన చిన్నతనం
ఇంకా అద్దంలోంచి
మచ్చగా కనిపిస్తూనే ఉంది—
నల్లని వెంట్రుక
తెల్లబోయినా
వయస్సు మడతలు
ఒంటి ముడతల మార్పును చూపించినా
గతించిన జవ్వన సింగారాలకు
అద్దం
అద్దం పడ్తూనే ఉంది—
అమ్మ బుజ్జగింపులతో
విసుగు మొట్టికాయల వడ్డనలతో ముగిసే
చిన్ననాటి జడల అల్లికలింకా
అద్దంలో అల్లుకునే ఉన్నాయి—
బాధకు
కాటుక
కన్నీరై జారిన క్షణాలను
అద్దం మనస్సున
ఇంకా అద్దుతూనే ఉంది.
అద్దం ముందు నిల్చుంటే
అన్నీ జ్ఞాపకం వస్తాయి—
వెనుకటివన్నీ జ్ఞాపకం వస్తాయి.

## వి. పి. చందన్‌రావు

### దోసిట్లో కాగితం పడవ

ఒక ఖాళీ నీలి ఆకాశంలో దేన్నో వెతుక్కుంటూ
శూన్యాన్ని చీల్చుకుంటూ పోతోంది ఒంటరి పక్షి.
జన సముద్రాల మీంచి శబ్దపర్వతాల మీంచి
ఈదుకుంటూ పాటలా ప్రవహిస్తోంది ఒంటరిపక్షి
చూస్తున్న కళ్ళల్లో దృశ్యమై సాగిపోతోంది ఆశ
దుమారమై చెలరేగిపోతోంది దురాశ
కనుకొలకుల్లో ఊరి
రెప్పల అంచుల్లోంచి నేలకు జారిన
నా రెండు కన్నీటి నీటి బిందువులు
లోయల్లోకి ఎగిసిపోతున్నాయి
పిచ్చి పిచ్చుకలై.
నాటినుండి కన్నీటి బిందువుల్ని
కనుకొలకుల్లోనే దాచిస్తున్నాను
నేను కన్నీళ్ళ రుచి తెలిసిన వాడిని
బాధల బరువుని మోస్తున్న వాడిని
సూది పోట్ల స్మృతుల్ని దాస్తున్న వాడిని
దుఃఖానికి గుడి కట్టిన వాడిని
ముల్లుగుచ్చుకున్నా నవ్వడం నేర్చుకున్నవాడిని
దెబ్బలకు అలవాటు పడిన నాలో కూచొని
ఎవరో రోదిస్తున్నారు
కష్ట సమయంలో కొందరు దూరమై పోతున్నారు
కొందరు తప్పించుకు పోతున్నారు
ఆఖరికి
నా కన్నీళ్ళు కూడా నన్ను విడిచి జారిపోతున్నాయి
నాలోంచి లేచి నడిచి పోతున్నాయి.

# కోట్ల వెంకటేశ్వర రెడ్డి

## అయినా మాకు మెదళ్ళులేవు!

ఇంకా ఇక్కడ పసి చేతులు
ఇరానీ హోటల్ టేబుళ్ళ బుగ్గలను
ముద్దాడుతున్నాయి
మంగళ సూత్రాలు కిరోసిన్ మంటల్లో
'ఆత్మహత్యలు' చేసుకుంటున్నాయి
అయినా మాకు మెదళ్ళులేవు
ఇంకా ఇక్కడ నిరుద్యోగ జేబుల్ని
ఉద్యోగ ప్రకటనలు కత్తిరిస్తూనే ఉన్నాయి
ఆఫీసుల్లో టేబుళ్ళ కింద చేతులు తడుస్తూనే వున్నాయి
యువరక్తం రోడ్లమీద క్రీస్తుబొమ్మలు గీస్తూనే వుంది
అయినా మాకు మెదళ్ళు లేవు!
ఇంకా ఇక్కడ మా పసిపిల్లలకు ఆకలేస్తే
చేతి వేలేదప్ప పాలడబ్బా దొరకదు
మా భార్యల శవాలకు రోగాలొస్తే
బ్రాందీలు దప్ప మందులు దొరకవు
అయినా మాకు మెదళ్ళు లేవు!
ఇంకా ఇక్కడ శ్రీశ్రీ మరో ప్రపంచం సూర్యుడు
తుపాకీ గొట్టానికి ఉరితీయ బడుతున్నాడు!
చలం స్త్రీ స్వేచ్ఛ మైదానాన్ని విడిచి
ఎక్కడికో లేచి పోయింది.
తిలక్ వెన్నెల్లో ఆడుకునే 'అక్షరాడ పిల్లలు'
వెండి తెరమీద 'క్యాబరే' నృత్యాలు చేస్తున్నారు
సినారె మానవతాధ్వజం రక్తసిక్తమై పోయింది
అయినా మాకు మెదళ్ళు లేవు!

## ఆర్వీయస్. సుందరం

### కామం

కండల్లో నిద్రపోతూ
అప్పుడప్పుడూ ఆవలించి లేచి
గుండెల్లో కుంపటి పెట్టి
వేడి నెత్తురు చేత పరుగులు తీయించే
కామం.

పసితనం గడిచేవరకూ
మనసు మట్టి పొరల కింద
గుటకలు మింగుతూ
కాలం గడిపే వానపాము
కామం.

చిగురు మీసాల వయసు కొలనులో
గిలిగింతలు పెట్టి
భయపెట్టి
వెళ్ళిపోయే నీళ్ళపాము
కామం.

మంచి వయసులో
పుట్టనుంచి బయటికి వచ్చి
తోకపై లేచి
ఆడి
బుసలు కొట్టి
వివేకంలోకి కోరలు దించే
కాలనాగు
కామం.

# మన చేతుల్ని వెతుక్కుందాం పదండి

మన చేతుల్ని వెతుక్కుందాం పదండి
హరప్పాలో నిద్రిస్తున్న
గుండెల మీద
తాజమహల్ పాలరాతి నీడల
చాటున
అమరావతి స్థూపాలు వినిపించే గాథల
మాటున
నాగార్జున సాగర జలరాశిపై
తేలాడే
పిల్లగాలి సరసన.

మన చేతుల్ని వెతుక్కుందాం పదండి
బృహత్కథ విన్న మహావృక్షాల
మొదళ్ళలో
సామ్రాజ్యాలు మిగిల్చిన కోట గోడల
నడుమ
ముంజేతికి మీసంగల వీరుల స్మారక శిలల
కింద
దేశంకోసం నూలు వడికిన రాట్నాల
పక్కన.

ఇప్పుడు వందలు వేలు లక్షలుగా కన్పిస్తున్న
ఈ చేతులెవరివి?
కబంధ హస్తాల్లా సామాన్యుల చుట్టూ అల్లుకుంటున్న
ఈ చేతులెవరివి?
సదా ట్రిగ్గర్ వైపూ బాంబులవైపూ సాగుతూన్న
ఈ చేతులెవరివి?
క్రౌర్యాన్ని, కౌటిల్యాన్ని, మాలిన్యాన్ని
మోస్తున్న ఈ చేతులెవరివి?
ఇవి
ఈ దేశంలో పుట్టి పెరిగిన చేతులు కావు
మన చేతుల్ని వెతుక్కుందాం పదండి.

# కీ. శే. కొంపెల్ల జనార్దనరావు

## ఆవేదన

అంటి తొలఁగింపఁ జాల మదర్పితములు
ముగ్ధ కుసుమముల్ కసుగంది పోవునేమొ
తహతహ నడంపఁజాల— నీ దర్శనమున
నొడలు పులకించు ధన్యత నొందవలయు.

## కొవ్వాళ్లకు

ఎంత జాలియౌ రాగాలోయివి! అపార
మాధురీప్లుత నైరాశ్యమయ విలక్ష
ణ స్మృతులఁ బాడుచున్నవి నా ప్రయత్న
ములను కుంఠీకరించి, అశ్రులకు మ్రొక్కి.

బిగురుఁగన్నెతనంపుమై గగురుపాటు
మనసు గరఁగిన నీరు- ఆ మధుర మధురి
మమును ముంచెత్తి వచ్చిన మాయక్షణము
లెంత వీఁకటి యేల్బడి యేలెనో కద.

తడవు దవ్వులనుండి వైతథ్య విధుర
వాంఛితములు నాకీ సదా భద్ర పీఠి
నిలిపిన నివాళి వెలుగులఁ గళలు దేఱ
నెంత జాలియౌ రాగాలో యివి

—1928

(ఈ కవితలు సేకరించి యిచ్చిన శ్రీ ద్వా. నా. శాస్త్రిగారికి కృతజ్ఞులము—
సంపాదకులు)

# కరుణశ్రీ

## యశోధర

విచ్చెడు తమ్మిపూలు నులివెచ్చని తేనెలతోడ స్వాగతం
బిచ్చుచునుండె; గుండె కదలించెడి ఈ మలయానిలమ్ములో
ఎచ్చటి కేగినావు హృదయేశ్వర! ఈ అరుణోదయమ్ముతో
ముచ్చటలాడు నీ నయనముల్ పయనమ్ముల కిచ్చగించెనా!

అద్ధమరేయి నిర్దయుడవై చనినాడ విదేమి స్వామి! నన్
నిద్దుర మేలుకొల్పి "తరుణీ నవ మానవ భాగ్యరేఖలన్
దిద్దుట కేగుచుంటి"నని తెల్పిన వాకిలి కడ్డువచ్చి "పో
వ"ద్దని యందునా హృదయవల్లభ అంతటి మూర్ఖులానా?

నాథుడవంచు నమ్మికొనినాను దయామయ, నిన్ను; నా మనో
నాథుడ వీ క్రియన్ భువన నాథుడవౌట యెరుంగ; నా మనో
వీథి ప్రబుద్ధమౌ మురళివే యనుకొంటినిగాని ఆ త్రయీ
వీథి ప్రసిద్ధమౌ ప్రణవవీణవు నీవని యెంచనైతినే

మంగళమూర్తి నీవొక సమస్యవు; నిన్ను గ్రహింపలేని ము
గ్ధాంగన యీ యశోధర; దిగంతము లేలు దృగంతముల్ కళా
రంగములయ్యె నా ప్రణయరాగిణి కంచు దలంచినాను; నా
మంగళ సూత్రమే "భువన మంగళ సూత్ర" మటం చెరుంగనే

చక్కనివాడు; కుందనపుచాయ తనుద్యుతివాడు; తళ్కుమేల్
చెక్కులవాడు; సౌహృదము చిందు కనుంగవవాడు; చూడుమో
చుక్కలరాజ నా ప్రణయ సుందర మోహనమూర్తి ఒక్కడై
ఎక్కడనుండెనో మది నాకించుక నన్ స్మరియించు చుండెనో!

# టి. వి. కె. సోమయాజులు

## అన్వేషణము

"శాంతి" ఎటేగెనో యెఱుక వాలదు మానవ దుష్టవృత్తి మా
న్వింత మటంచు నెంచి బలిపీఠము నెక్కెనో; కాక, శుష్క వే
దాంతుల రాజకీయములు హత్య యొనర్చెనో, లేక; ఇంత ఏ
కాంతమునందు చూచినను, అయ్యయొ శాంతి లభింప దక్కటా!

కామ విమోహితాత్ములయి గాథలు సృష్టియొనర్చువారి హిం
సామయ జీవితోద్ధత విషాద విజృంభణ చూడలేక మా
సీమలు దాటి పోయితివొ? శ్రీకరమౌ భవదీయ కాంతి బా
ధామయ జీవితంబులకు దారిని తెల్పెడి పాలపుంతయౌ.

ఓంకారంబున యోగ మార్గమున దాగున్నావొ? ఈ క్రోధ ని
శ్శంకోన్మత్త పిశాచ నృత్యముల మూర్ఛన్మగ్ని యున్నావొ? మా
కింకన్నీ పద పద్మదర్శనము లేనే లేద మా తల్లి? నీ
అంకంబందు పరుండు భాగ్యములు లేవా? శాంతి మాతా, యికన్.

లోభ దరిద్ర దేవతకు లోఁబడి జాతర చేయనెంచి; సం
క్షోభము సృష్టి చేయఁగల చోరుల, దారుల దోపిడీల కెం
తో భయమెత్తి పోయితివి దూరము, నీ పయనించు దారులన్
లోభ శిలావరోధము–ప్రలోభము–మోహము తాండవింపఁగా.

మదమాత్సర్యములేలు రాజ్యమున అమ్మా, శాంతి కన్పింపవా?
కథలై పోయెనె, శాంతికేతనము లాకాశంబులో నాడ మా
యెదపై మల్లెలు విచ్చురోజులవి, మేమీ చీకటిన్ జ్యోతికై
పది దిక్కుల్ కనుచుంటిమమ్మ, ఇక లేవా? శాంతి కన్పింపవా?

# కీ. శే. కొడాలి ఆంజనేయులు

[వీరు కవి సమ్రాట్ విశ్వనాథ సత్యనారాయణగారితో కలిసి జంట కవిత్వం చెప్పిన ఉత్తమ కవులు; గొప్ప దేశభక్తులు; గాంధేయవాది. రామాయణ కల్పవృక్ష కృత్యవతరణికలో విశ్వనాథ ఈ ప్రియమిత్రుని సౌహార్దాన్నీ, మధుర కవితాశక్తినీ, దేశభక్తినీ స్తుతించారు. కొడాలి వారి కవితలు కొన్ని 'వైతాళికులు, మహోదయం, నవీన కావ్యమంజరి, మణిమకుటం, తెలుగు కావ్యమాల' మొదలైన సంకలన గ్రంథాలలో వచ్చాయి. 1920–30 మధ్య మరికొన్ని కవితలు 'సాహితి' 'సఖి' ప్రతిభ' 'జ్వాల' 'ఉదయిని' 'వీణ' 'కృష్ణాపత్రిక'లలో ప్రచురింపబడ్డాయి. ఇంకా కొన్ని అముద్రితాలుగా ఉండి పోయాయి. ఈ కవిగారి కుమారులు శ్రీ కొడాలి మురళి కర్నాటకంలో తుంగభద్ర డాంలో ఇంజనీరుగా ఉన్నారు. వారి సౌజన్యంతో కొన్ని కవితలు ప్రకటిస్తున్నాము]

## 1. సాంధ్య సాగరము

శాంతి ఎఱుగని దీర్ఘ వైశాఖ దినము
కొంత సేపు నీ ఒడిలోన కునుకువచ్చె
బాడబాగ్ని గభీర గర్భమున దాల్చు
తల్లి! తాల్మి పోనాడి ఘోషిల్లెదేల?

ఈ విశాల సాంధ్యతమమ్ములెల్ల జగతి
వ్రాలి నిద్రాప్రశాంత జీవముగఁ జేసె
జనని! ఏలనో నీకు విశ్రాంతి లేదు
ఎవరి హృదయ కల్లోలమ్ము లెవరి కెఱుక!

ఆ వినీలమహాబధిరాంబరంబు
దగ్గఱకు వంగియును చెవియొగ్గి వినియు
కనుగొనెనొ లేదొ నీ దుఃఖ కారణంబు
కడుపు తఱుగుకు పోవు నొక్కనికి నాకు.

## 2. ఉదయపూజ

నిర్జనవనాంత సీమల నిలచియున్న
ఆశ్రమకుటీర శాద్వల ప్రాంగణముల
పొడుపుటీ రెండల పసిండి ముగ్గువెట్టి
వచ్చితి వుషఃకుమారిక వందనమ్ము!

చినుగు పుట్టమ్ము మఱుఁగున సిగ్గుదాచు
కొనిన నిరుపేద నేమిచ్చికొందు నీకు
సౌరభము వోని హృదయ పూజాసుమమ్ము
హర్ష ముక్తాశ్రు బిందు మాల్యమును దక్క!

## 3. తేనెటీఁగ

చినుకు చినుకుగ చేర్చి పెట్టిన
తేనె పట్టుల కొల్లగొట్టే
కొండ రాజుల దండుపై బడి
కుట్టితే తప్పా?

చేనుచేనూ చెట్టు చెట్టూ
మొగ్గ మొగ్గా పువ్వు పువ్వూ
తిరిగి కూర్చిన తేనె పెరలకు
దొరలు సోమరులా!

కూడులేనీ గ్రుడ్డకై నే
నోరు కట్టుకు కూరుచుంటే
తేనెలన్నీ త్రాగ వీరల
కెవరు చెప్పారో

కోటలున్నా కోటులున్నా
దొంగ సొత్తులు దొరలకిష్టము
కష్ట జీవుల కడుపు కొట్టే
బ్రతుకు వారిది స్పష్టము!

# తుమ్మపూడి కోటీశ్వరరావు

## సంవేదన

(కళాతపస్వి విలాయత్‌ఖాన్ సితార్ నాదానికిది అక్షర రూపం)

శిలలందున సెలయేరై
తొలిదిక్కున వెలుపూతతో పక్షిగళా
కుల కలగానరవళి
జలజలమని పారుదెంచె ఝాంద్రీఝరియై.

వెలుగులు లేనివేళ కనుపించక ఎచ్చటినుండి సాగెడిన్
[1]గలగల నర్తకీ చరణ కంకణ కింకిణి కుంకుణు స్వన
మ్ముల సుడులైన ఈ నినదముల్ తెలికల్వలు పూచెరోదసీ
తలముల లేత వెన్నెలలు దారపు తోగులు వారినట్లుగా.

[2]గగన గుణమెల్ల పూచి చక్రములుగాగ
కస్సునన్ దూసి కొంచు రోదస్సునుండి
వచ్చి జూకాల మల్లెలై పరిమళించె
నాద మాధుర్యముల్ జగన్మంటపమున.

కోణార్క పాషాణ కుడ్యతలమ్ముల
కమనీయ కామ శిల్పమును మీటి
[3]ఖజురహో సుందరీ నిజరహో నేత్రాంత
రమణీయ భావనర్తన మొనర్చి
అట నజంతాగుహ నప్సరో దరహాస
లవమందు రేఖికాలతలు[4] చుట్టి
కాళిదాస మనోజ్ఞగళ వివర్తము పురూ
రవు, యక్షు, గీతికారమ్య మగుచు

ప్రజ్ఞకందని ఒక దివ్య భావమురలి
వ్యక్తనాదమై జగమెల్ల ప్రాకి కొనియె
సుందరావర్త నర్తన స్పందనముల
లలితమగు రాధికా విప్రలంభమగుచు.

తానవెడిదెల్ల అట్టె ముద్దయయి ముడిగి
[5]తానె తనలోన పొందు వేదనలొ యేమొ
విన్న దేవత కరుణించి వెడల- సాగు
[6]పసిడి గజ్జెల ముద్ద సవ్వడులొ యేమొ.

చెమట చిత్తడి, పొడి నిద్ర చెందువేళ
వేగుబోకల మాలతి విరులనుండి
పొలయు చైత్ర పవనముల బోదలేమొ
తనువునన్ చందనంపు పూతలయి తగులు.

లోయలందేటవాలుగ సాంధ్య రాగంబు
గిరిధాతు మిశ్రిత ఝరము వోలె
గుబురులొ చెట్ల ఆకులపైని తొగరు వ
న్నెల కెరటమ్ములై తొలకినట్లు
పూల పున్నాగ పత్రాల పచ్ఛదనాల
పై శరచ్చంద్రికల్ ప్రాకినట్లు
గోమతీ శరదాపగా మృదు భంగాల
తేలి వచ్చెడి కుందమాల [7]వోలె

సకల భావ సముద్దీర్ణ శాంతనాద
మొకటి హృదయమ్ము నట్టె పట్టుకొని వ్రేలు
సిత సరస్వతీ మృదుగళ సీమయందు
లంబమాన ముక్తా ఫలాలంకృతి విధాన.

హృదయ గుహయందు చెలమలేవేని గలవొ?
అమృత సుస్వాదు మాధుర్య మవఘళించి
బుడగలై వచ్చి గళసీమ మూసి, పొంగి-
కనుల వానంద బిందు నర్తనము చేయు.

[8]అంచలాబద్ధ నిస్తబ్ధ, అంబు కణ స
మార్ద్రపతి తిరస్కృత-సతిదైన దృష్టి
ప్రణయ విరహార్తి శితశిఖా భాస్వరమ్ము
లెంత సంవేదనోదయ హేతువయ్యె.

1. తాళధ్వని (సితార్ మీద)
2. జూకాల మల్లె నీలవర్ణం- సున్నితమైన వాసనగల చక్రంలాగా గుండ్రంగా అందంగా సుమారు పగలు 10 గం.ల ప్రాంతంలో విచ్చేపూవు
3. నిశ్చల మధుర దృష్టి
4. అజంటా చిత్రంలోని రేఖకు 'బంగారు తీగ రేఖ' అని పేరు
5. అతని 'యమన్' రాగ అనుభవం
6. తాళ స్వనాలు
7. దిఙ్నాగుని నాటకంలోని విషయం
8. అతని 'దర్బారీ కానడ' అనుభవం

"కావ్యముల్ త్రయీ మంత్రముల్ గావు, జన్మ
మోక్షసంధాన హఠ యోగములును కావు;
ప్రాణి యంతఃకరణవృత్తి భావమయ మొ
నర్చి మృదులీకరించు ఆనందకళలు"

—రాయప్రోలు

# సరగు కృష్ణమూర్తి

## ఎవ్వర వీవు?

ఎవ్వర వీవు రత్నముగ నీ హృదయమ్మున వెల్గుచుంటి! వీ
వెవ్వరవో వచింపుము– మహీస్థలి కిచ్చి చిరంతన ప్రభల్
దవ్వుల దవ్వులన్నిలిచి దాపరికమ్మున ఎచ్చి వెళ్ళనో
దివ్వెల దైవమా! తలుపు తీసితి లోనకు రమ్ము రమ్మికన్.

నా కనుదోయి పంట, శ్రవణమ్ముల తీయని గంట, భావ ర
త్నాకర హృద్విహార కలయానము, ప్రాణము, నా తపమ్ము, నా
నా కలకంఠ కంఠ కలనాద సమన్విత గీతి, వేచినా
నీకడ నేను నీకయి ప్రతీక్షల దీక్షల మోక్ష భిక్షకై.

ఆకసమందు నింద్రధనువై, రవివై, శశివై, వసుంధరన్
నాక మయూఖ మండిత సనాతన నూతన దీధితి ప్రియా
లోక విధాత్రివై, హృదయలోకమునందు మఱొక్క లోకమై
యీకడ నున్న నీవు నను నేకడఁ జేర్పఁగఁ జూచుచుంటివో.

నీ నగుమోము నా హృదయ నీరరుహామృత గంధ బంధురో
ద్యానము, నీ స్వరమ్ములు మదాకుల కంఠ నివిష్ట కాకలీ
మానస రాగభోగములు- మాటున నుండఁగ నేల-గుండెయా
ధీనము నీకు- నెవ్వరవొ తెల్పుము కల్పములుల్లసిల్లగన్.

నిను గుర్తించితి– నీవు నా హృదయ సందీపమ్ము- మద్భావనా
వన హేలాంచిత కల్పనాలతవు, నా వాగ్దేవి, వస్మిత్కళా
ఘన సౌదామిని వీవు నాశ్వసన గంగా మంజు తీరమ్ము– నీ
వని గుర్తించితి రమ్ము రమ్ము హృది శూన్యత్వమ్ము వారింపఁగన్.

నీవు వచ్చిన నిజమౌదు నేను నేను
నీవు చేరిన యప్పుడే నేను నేను
నీవు లేనిచో నిక్కము నేను లేను
నేను లేనిచో సత్యము నీవు లేవు.

నీవు సాగరమ్ము నిజమ్ము నేను నదిని
నేను శరధి నైనప్పుడు నీవు నదివి
నభము నీవు విమానము శుభము నేను
నభము నేనైనపుడు విమానమ్ము నీవు.

ద్వైతమదేల, యేకమయి ధాత్రికొసంగుము నిత్య హర్షమ
ద్వైతవసంత; మీ వికల తాపము శాపము వీడిపోవ, జ్యా
జాతకమందు మార్పుల ప్రశంసలు హంసలభాతిఁజెల్ల, నా
భూతల నందనమ్మగుచు పూర్ణ ఫలమ్ముల నీయ రావటే!

ఎవ్వరవీవు నాకలల యిమ్ముల కమ్మని కల్మి పంటవో!
దివ్వెల మోద నాదముల దీప్తుల ప్రాప్తుల నిచ్చుఘంటవో!
పువ్వుల పొన్పులందలసి పోయి క్షమాస్థలి వచ్చు నీకు నీ
వెవ్వరవంచుఁదెల్పెదను హృద్వన దేశ విహార వేళలన్.

"కుక్కపిల్లలాగా పాకుకుంటూ
నా ఒంటరి పడక మీదికి రాకు.
నీవెవరో నాకు తెలీదు. నేనే విధంగానూ
నీకు సహాయపడనూ లేను.
నేను ఇంకా సంతోషంనుంచి కోలుకోలేదు."

—అన్నా అఖ్మతోవా

## వినోకురొవ్

### సంగీతఝుంఝ

సంగీతానికున్న శక్తి దేనికుంది?
తుఫానుకుందా? బడబాగ్నికుందా? ఉప్పెనకుందా?
లోతుల కీదినకొద్దీ, సంగీతం
మనల్ని తనలోకి లాక్కుంటూనే ఉంటుందా?

లయలలోయల్లో పడి ప్రవహించే
సంగీతాన్ని నా చెవుల్లో పోస్తే
తడి నెరుగని వైనా నా నయనాలు
బాష్పజల కూలంకషాలవుతాయేం?

సంగీతం కళ్లకసలు కనిపిస్తుందా?
సంగీతం తక్కెళ్లలో తూయబడుతుందా?
పురుటికందులమై తల్లి ఒడిలో
పాలు తాగే దశలోనే
మన నెత్తుటి సెలయేటనే
ఉంటుందా సంగీత బిందువు?

జలం లవణంలో లీనమైనట్లు
సంగీత సుధారసం
ప్రపంచంలో అణువణువునా
లీనమై ఉంటుందా?

గాయకులో గాయనులో
ఆలాపించే సంగీతమందిరం
గవాక్షాల్లోంచి రివ్వున వీచే రాగాలు
రైలుస్టేషన్ చుట్టూ మూగే వేగాలా?

సన్నని సూదికంటికి దారి పొడిచి
సాగిపోయే ఒంటెలా
కనిపిస్తుందేం దారంలా
తిన్నగా సాగే ఒక రాగం!

రాగాలు ఆడుకునే గాలిదేవతలు కాదుగదా!
వాటికి ఆటలే జీవనమా?
"మాతో ఆడుకోవడానికి రావూ?"
అంటూ నన్ను పిలుస్తాయేం?
నా చేత ఆటాడిస్తాయేం?

ఎవరికీ అందని అదేదో సిద్ధాంతం
ఒకటి సంగీతంలో ఉందా?
"ఈ భూమి మీద ఉన్న అన్ని
వ్యత్యాసాల్నీ అన్ని విరోధాల్నీ
కరిగించేస్తా" నంటూ అది సవాలు చేస్తోందా?

ఇన్ని శతాబ్దాల ఈ ముసలి సంగీతం
ఇంత ఇంద్ర జాలం ప్రయోగిస్తున్నదంటే
దానికేమీ కారణం లేకుండా పోతుందా?

సంగీత మహిమ గురించి
నేనో చక్కని సంఘటన విన్నాను
చెబితే అది అసంగతం అనకండి
చెవి ఒగ్గి ఇంకేమీ వినకండి

సంగీతం విన్న తన్వంగీలలామలు కొందరు
సరస సంక్షోభంలో పడిపోయారు
కెరటాలై పొంగే కేశాలతో
వెదురుకర్రలై నూర్చే కరాలతో
గిరిశిఖరాలకు ఎగసిపోయారు!

కానీ, గాయకుడొకడరుదెంచి
తన వేణువు రాగాలను మారిస్తే
తనువులనే గాలిపటాలుగా
తన్వులు ఎగరేశారు.

ఎప్పటిదో ఏ జానపదగాథో
ఇది అయి ఉంటుందేమో?
కానీ ఇప్పటికీ
రాగమహిమ అలాంటిదేనేమో?

వాద్యబృందం సంగీత శిఖరాలకూ
లోయలకూ మధ్య ప్రవహిస్తూంటే
ఆ ధ్వని తరంగాలే చాలు
శ్రోతల బధిరత్వపు బెరళ్లను
పగులగొట్టేందుకు!

అందుకే అంటాను
'సంగీతం పదునైన గొడ్డలి' అని
పనివస్తే, అది ప్రయోగిస్తే
మొండి చెట్ల మూర్ఖపు బెరడు
ఊడిపోక తప్పదు!

(Evgeny Vinokurov కవితకు అనుసరణ డా. మిరియాల రామకృష్ణ)

"నడకకు అంతం పడక
ఈ నడకకు అంతం లేదు
ఈ నడకకు అర్థం లేదు
అయినా ఇది వ్యర్థంకాదు"

—బైరాగి

11 వ శతాబ్దినాటి చైనా కవిత

## ✓ సూతుంగ్-పో

### అతనికి కొడుకు పుట్టినప్పుడు

కుటుంబాల్లో
ఒక బిడ్డ పుట్టినప్పుడు
అందరూ కోరుకుంటారు
వాడు మంచి తెలివి గలవాడు కావాలని.
తెలివితేటల వల్లనే
జీవితమంతా నాశనం చేసుకున్న నేను
ఆశిస్తాను
నా కొడుకు
అజ్ఞానిగా మూర్ఖుడుగా మారాలని.
అప్పుడు వాడు
ప్రశాంత జీవనాభిషిక్తుడవుతాడు
ఒక క్యాబినెట్ మినిస్టర్‌గా మారుతాడు

(ఆర్థర్ వ్యాలీ ఆంగ్లానువాదానికి తెనిగింపు : తంగిరాల)

"కొద్దిగా చోటివ్వండి ఈ ఇంట్లో
నేనొక కవిని
నాకు కావల్సింది హృదయముండే
ఐదారు చెవులు"

—కన్నడ కవి జి. ఎస్. శివరుద్రప్ప

## లియోపోల్డ్ సేడర్ సెంఘర్

### తుఫాను

నా చుట్టూ వున్న ప్రతిదాన్నీ ధ్వంసం చేసింది తుఫాను
నా లోపలి ఆకుల్నీ బద్ధకపు మాటల్నీ దుల్చి వేసింది తుఫాను
మోహపు సుడిగాలులు నిశ్శబ్దంలో బుసకొడతాయి
కాని పొడిగాలుల దుమారం పైనా, వానల గుంపుపైనా శాంతి!

ఓ గాలీ! భయంకరమైన స్వచ్ఛమైన గాలీ!
ఆహ్లాదకర వాతావరణపు గాలీ!
గుండెల ఇసుక తిప్పల మీద తిరిగి ఇసుక పడినప్పుడు
ప్రతి పుష్పాన్నీ ప్రతి శూన్యాలోచననీ దగ్ధం చెయ్యి.
హఠాత్తుగా విగ్రహంలా నిశ్చలుడవనీ సేవకుడు,
నీ క్రీడల్లో నీ దంతపు నవ్వులో చికితులవనీ చిన్నపిల్లలు.

ఓ తుఫానూ!
నీ శరీరం నీ ధ్వనిని భక్షించనీ,
ఒక స్తంభంలా ఒక తాడి చెట్టులా
నా రాత్రిని వెలిగించే ఆ జ్వాలతో
నీ కండల సువాసన ఎండిపోనీ.
ఓ దివ్యశక్తీ!
రక్తంతో నా పెదవుల్ని మండించు,
'గలాం'[1] బంగారంలా స్వచ్ఛంగా
నా పాట పైకి లేచేలా
నా 'కోరా'[2] తీగల మీద శ్వాసించు!

(ఆంగ్ల మూలానికి అనువాదం–తంగిరాల)

---

1. సెనెగల్ నదీ తీరాన ఒక పట్టణం. ఒకప్పుడు బంగారుగనులకు ప్రసిద్ధి.
2. ఒక రకమైన గిటార్. ముఖ్యంగా స్తోత్రపాఠకులు తమ మాటలకను గుణంగా వాయిస్తారు.

## శక్తి ఛటోపాధ్యాయ్

### నన్ను క్షమించు

రంగు రంగుల జాడీ
టేబిలు మీద పగిలింది
అది రోజూ పగులుతుంది
ప్రతి దినమూ వాన కురుస్తుంది
దినమంతా —
ధ్వని వ్యాపిస్తుంది
ఒక ధ్వని సముద్రంగా....
ఎక్కడ వర్ణం ధ్వనికి ముందుంటుందో
ఎక్కడ సౌందర్యం వర్ణానికి ముందుంటుందో
అక్కడ పురాతన ధ్వని పుడుతుంది
ఇసుక మీద
ఆమె వక్షోజాల ముద్రలు వేస్తుంది.
నాకు నోరూరుతుంది
ఆమె
తన ముఖం నా భుజం మీద ఆన్చి
గుసగుసలాడుతుంది
నన్ను క్షమించు
ఇంక నేను పాడలేను.

(ఆంగ్లమూలంనుండి అనువాదం — తంగిరాల)

"మనుష్యుడే నా సంగీతం
మానవుడే నా సందేశం" —శ్రీశ్రీ

పంజాబీ కవిత

# అమృతా ప్రీతమ్

## నగరం

నా నగరం
ఒక సుదీర్ఘ చర్చ ఉన్నట్టు
వీథులు-అసంబద్ధవాదాలు ఉన్నట్టు
మరి సందులు–
ఒక మాటను ఎవరో
అటునుండి యిటు, ఇటునుండి అటు లాగుతున్నట్టు
ప్రతి యిల్లూ బిగించిన ముష్టి ఉన్నట్టు
గోడలు–పళ్ళు కొరికినట్టు
మోరీలు–నోటినుండి నురగ కార్చినట్టు
ఈ చర్చ సూర్యుణ్ణుండి ప్రారంభమైనట్టు కనబడుతుంది
దాన్ని చూసి చర్చ ఇంకా వేడెక్కుతుంది

ప్రతి ద్వారం నోటినుండి
సైకిళ్ళ, స్కూటర్ల చక్రాలు
తిట్లలాగ దొర్లుతాయి
గంటలూ హారన్లూ ఒకదానిమీదొకటి పడతాయి
ఈ నగరంలో పుట్టే ఏదో ఒక బిడ్డ అడుగుతుంది :
'ఏ విషయాన్ని గురించి చర్చ జరుగుతోంది?
మళ్ళీ ఆ ప్రశ్న కూడా చర్చింపబడుతుంది
చర్చనుండి బయలుదేరి చర్చలోకి చేరుతుంది
కంబ గడియారాల గంటల్లు మ్రోగి
రాత్రి వస్తుంది, తలబాదుకుంటూ వెళ్ళిపోతుంది
కాని నిద్రలోనూ చర్చ ముగియడం లేదు
నా నగరం ఒక సుదీర్ఘ చర్చ ఉన్నట్టు.

(హిందీ అనువాదంనుంచి తెనిగింపు : టి. జి. ప్రభాశంకర్, తంగిరాల)

# గోపాలకృష్ణ అడిగ

## ఏదో ఒకటి చేస్తుండు తమ్ముడూ

ఏదో ఒకటి చేస్తుండు తమ్ముడూ;
గోళ్లగిల్లుకుంటూ కూర్చోవద్దు;
ఆ మొక్క పీకు, ఈ చిగురు తుంచు.
పూలను నలిపి పారెయ్; గడ్డిపోచలు
కనిపిస్తే చెయ్యి లంకాదహనం.
సీతాకోక చిలుక, చిలుక, పిచ్చుక- ఎక్కడుంటే
అక్కడే తరుముకో, పట్టుకో, దంచెయ్;
పీకెయ్ రెక్కలు ముక్కలుగా.
అడవియేనుగు అడుగు పెట్టిన నందనంలో
వెక్కుతున్నాయి ఇక్కడ మల్లి అక్కడ అరటి.
చుట్టూ గోడలమీద పౌరుషం
స్విచ్చి; కళ్ళు మూసుకో;
ఒత్తు పదులు ఇరవైలు ఒకేసారి; నేల; నీరు; నింగి
-బంగారుగుడ్ల కోడికడుపు-చీల్చు,
"చెయ్యి లేదా చావు",
నీ నాల్గు కాళ్ళ నృత్యానికి ప్రతి నిముషం
ఏదో ఒకటి ఖతం కాకుంటే నీ
అద్భుత ప్రతిభకే లోపం తెలుసా, తమ్ముడూ.
వానరుణ్ణి చెయ్యబోయి వినాయకుణ్ణి చేశారు భలే.
అడవి ఉంది, నరుకు; కట్టు తోరణాలు. చేతిలో
గొడ్డలి ఉంది, మడ్డు కత్తి, రంపం, కత్తి; ఎత్తెత్తి
ఆడించాడించు-
ఒక్కొక్క ముఖానికీ మధ్య ఒకటి రెండు మంచు గోడలు లేస్తే,
దారిలో కళ్ళెదుట రెండు బాటలు కనిపిస్తే,
రెండు గిరిశిఖరాలు తలలెత్తి నిలిస్తే,

నీ కెందుకు ధర్మ సందేహం?
చేతికేది దొరికితే అది తిను
కళ్ళకేది కనిపిస్తే దాన్ని పట్టి పిండు;
కాలికేది అడ్డమైనా పట్టి కత్తిరించు
ఈ అబల
'పడుకున్న తల్లి పృథివి'
డీలాపడి పడుకుంది, ఆకాశం వైపు
కళ్ళు సారించింది
ఆమె సర్వాంగాల్లో
కొద్ది రక్తం మిగిలినా కొరికి పీల్చు.
మాంసం లేదా?
మాంసం? ఎముకలు నరాలు ఉంటాయ్ లేవోయ్
అహహా, నువ్వు మగాడివోయ్!
ఆఁ, అక్కడుంది బతుకు బావి.
కట్టు కపిల— ఎందుకో ఒకందుకు—తోడు నీళ్ళు
బావి పూర్తిగా ఎండేవరకూ తోడు.
అణువు పగలగొట్టు, మహత్తు పొందు
బ్రహ్మాండానికి ఎక్కుపెట్టు బ్రహ్మాస్త్రం
విజయీభవ.
ఏదో ఒకటి చేస్తుండు తమ్ముడూ!
గోళ్ళు గిల్లుకుంటూ కూర్చొని
భూమికి భారం కావద్దు నువ్వు; భూమి
భారం తగ్గించడానికి ఇలా చెయ్యి నువ్వు
అదే సరి, సహజం.

(కన్నడ మూలంనుంచి అనువాదం—సుందరం)

"ఎవ్వరూ లెక్క చెయ్యని
ఆ తోట సౌభాగ్యాన్నంతట్నీ
ఆ సూర్యకాంతి మోస్తోంది"

—జపాన్ హైకూ

# రామచంద్ర శర్మ

## రూపాంతరం

నల్లకంబళి అంచుల్నించి కొంచెం పీకి
ముడివేసి విడిచి పెట్టినట్లు
ఒకదాని వెనక బుడ బుడ పాకిన కంబళి పురుగు.
దండయాత్రకోసమే ఈ దండు ఖచ్చితంగా-
ఖచ్చితమేనా? ఖచ్చితమైంది గతి మాత్రం.
పట్టిలాగి సడలించి మళ్ళీ పట్టిలాగినట్లు
నూరువేల ముళ్ళు ఒక్కుమ్మడిగా ఎగుడు దిగుడు.

హఠాత్తుగా, వరస చెడి అడ్డదారి తొక్కిన
పురుగొకటి సరసర పాకి గోడ పట్టుకొని ఎక్కి
కిటికీ అంచున చేరి ఒక మూలకు పాకి
పడుకోవడం విచిత్రమే.
ప్రాణాంతకమైన ఏదో రహస్యపు పని మీద
బయలుదేరిన గూఢచారి పురుగు- దానికి
మూల చీకటి రక్ష, దానికక్కడే డేరా.

తెలతెలవారినా అక్కడే కదలకుండా ఉన్న పురుగు.
హరాకిరి ప్రతిన పట్టినట్లు-
ప్రాణత్యాగం కోసం ఎంత సంబరం?
పురుగు కాదేమోమరి, పురుగైన ఋషేమో.
ఋషి ఇచ్ఛామరణానికి ఇదే తగిన చోటు.

క్రమక్రమంగా ముళ్ళ వెంట్రుకలన్నీ రాలి
గాలికి చెల్లాచెదరై చివరికి మిగిలిందొక బక్కచిక్కిన ఉండ.
మొదట వెలవెలబోయిన రంగు నెమ్మదిగా
పచ్చనై కొంత నీలం కలిసి దానికి
మెలుతుత్తం రంగు. అక్కడక్కడా తోడులేని ముళ్ళు-
తగిల్తే ఇప్పటికీ వేళ్ళు చిమచిమ.

పీనుగలాగా పడి గూడుకట్టిన ధ్యానమగ్న
కవి తపస్విలాగా అచలంగా ఉన్న ఉండ.
అయినా, బీమలు తాకినా ప్రతిఘటన,
ఉండ పొడుగునా గాభరాతో చలనం.
చావు కాదది, చచ్చి పుట్టే సంఘటన.
కడుపులో భ్రూణం కాలు ఝాడించినట్లు,
అజ్ఞాతం అడుగున అజ్ఞేయ కవిత.

లేయెండగల ఒకనాటి పొద్దున
ఉబ్బి కొంచెం పారదర్శకమైన
ఉండలో ఏదో త్వర, పునరుజ్జీవనానికి
సమయమాసన్నమైందని సంభ్రమం.
ఉన్నట్లుండి కన్పించిన కాసంత తొర్ర,
గాలి మూసిన మీసం, తొర్ర అంచుకు పాకి
బెదిరి లోపలికి జారినట్లే జారి పైకెక్కి
ఒళ్ళు ముడుచుకు కూర్చున్న సీతాకోక చిలుక.

గాలి వెచ్చగా వీచి తేమ ఆరిన లేతనైన తెల్లని రెక్కలు
పటపటలాడించి బల్లికి దొరక్కుండా
గాలికెగసిన తెల్లని సీతాకోక చిలుక–
కొత్త పుట్టుకకు అనువైన కొత్త మాటలు
పొందిన ఒక కవిత,
అఫ్రోడిటి.

(కన్నడ మూలంనుంచి తెనిగింపు—మందరం)

"రాత్రి అయ్యేసరికి సజీవ వస్తువులు మౌనం వహిస్తాయి
నిర్జీవ వస్తువులు మాట్లాడుతాయి
నిద్రలో నిశ్శబ్దం వెలిగిస్తుంది నా స్వప్నాల దారుల్ని" —శేషేంద్ర

# చైతన్య కవితా వేదిక

అధ్యక్షులు : డా. తంగిరాల సుబ్బారావు

కార్యదర్శి : డా. ఆర్వీయస్. సుందరం

కోశాధికారి : డా. సరగు కృష్ణమూర్తి

సహకార్యదర్శి : పి. యు. బి. శర్మ

పోషకులు

శ్రీయుతులు

1 సి. ఎన్. రెడ్డి, మైసూరు
2 రమణయ్య రాజా, మద్రాసు
3 ఇందిరాదేవి ధనరాజ్‌గిర్, హైదరాబాదు
4 సకలా నరసింహులు శ్రేష్ఠి, బెంగుళూరు
5 తిక్కవరపు పట్టాభిరామిరెడ్డి(పఠాభి), బెంగుళూరు
6 యస్. స్వతంత్రరావు, ఐ.ఏ.ఎస్., బెంగుళూరు
7 రుక్మిణి, బుల్లా సుబ్బారావు, ఐ.ఏ.ఎస్., దంపతులు, బెంగుళూరు
8 వై. వి. వెంకటేశ్వరరావు, బెంగుళూరు
9 కె. పి. రావు, బెంగుళూరు
10 శంకరి, కల్నల్ టి. కె. మూర్తి దంపతులు, 99 ఎ.పి.ఒ.
11 బాలాత్రిపుర సుందరి, తంగిరాల భాస్కరరావు దంపతులు, రాజమండ్రి
12 మార్కండపురం శ్రీనివాస, బెంగుళూరు
13 డా. జి. సుధ, డా. జి. సాంబశివరావు దంపతులు, గుల్బర్గా
14 చిట్టూరి బాపినీడు, తణుకు

జీవిత సభ్యులు

శ్రీయుతులు

1 ఎస్ నారాయణ రెడ్డి, హైదరాబాదు
2 కె. యస్. యమ్. యన్. శమంతకమణి, అమలాపురం

3 సి. హెచ్ రమణకుమారి, రాజమండ్రి
4 డి. వి. ధన్వంతరి, చింతలూరు
5. బులుసు వేంకట సత్యనారాయణ మూర్తి, రాజమండ్రి
6 ఎన్. శేషగిరి, రాజమండ్రి
7 డా. దివాకర్ల రాజేశ్వరి, బెంగుళూరు
8 గొల్లపూడి సుబ్బారావు, విజయవాడ
9 వారణాసి వేంకట భాను మూర్తి, విజయవాడ
10 పి. యు. బి. శర్మ, పోలవరం
11 టి. జె. భవాని, జోగిరాజు దంపతులు, అదిలాబాద్
12 డా. టి. గోపాలకృష్ణారావు, విడవలూరు
13 పి. పార్థసారథిరావు, హైదరాబాదు
14 కొల్లూరి, అమలాపురం
15 ఆసు రాజేంద్ర, అమలాపురం
16 తంగిరాల వేంకటకృష్ణ సోమయాజులు, తణుకు
17 వి. వై వి. సోమయాజి, తణుకు
18 వై. చిత్తరంజనరావు, బెంగుళూరు
19 కూచిమంచి రామారావు, హైదరాబాదు
20 పరిపాటి వేణుగోపాలగుప్త, తీర్థం
21 పంపన సూర్యనారాయణ, పెద్దాపురం
22 జోస్యుల సదానంద శాస్త్రి, అనంతపురం
23 కొంపెల్ల రామకృష్ణమూర్తి, రామకృష్ణాపురం
24 డా. చన్నాప్రగడ తిరుపతిరావు, బెంగుళూరు
25 డా. జి. ఎస్. మోహన్, బెంగుళూరు
26 టి. ఆర్. హేమావతి, బెంగుళూరు
27 ఎస్. షణ్ముగం, నెక్కుండి
28 కె. వి. ఆర్. సుబ్రహ్మణ్య శర్మ, తొండంగి
29 జి. ఆర్. వేంకటేశులు, గుంతకల్లు
30 శీలా బ్రహ్మయ్య, బళ్ళారి
31 ఏ. దత్తాత్రేయ శర్మ, విజయవాడ
32 నాగలక్ష్మి, తంగిరాల వెంకట సుబ్బావధానులు దంపతులు, బెంగుళూరు
33 ఇప్పగుంట మాధరావు, మాచెర్ల
34 విశ్రాపూరి వేంకట భాస్కర సుబ్రహ్మణం, ఏలూరు

35 ఆచార్య జి. వి. సుబ్రహ్మణ్యం, హైదరాబాదు
36 డా. సి. వి. సుందరరామ శర్మ, విజయవాడ
37 యస్. సర్వమంగళ, పొన్నమాకుల పల్లి
38 సీతామహలక్ష్మి, సి. జి. పుట్టప్ప దంపతులు, బెంగుళూరు
39 రేవతీ శశిప్రియ, అశోక్ కులకర్ణి దంపతులు, గుల్బర్గా
40 తంగిరాల సీతారామరాజు, బెంగుళూరు

ప్రత్యేక సభ్యులు

శ్రీయుతులు

1 వి. రామచంద్రరావు, రాజమండ్రి
2 వై శ్రీరాములు, రాజమండ్రి
3 పి. మహలక్ష్మి, కుప్పం
4 నేతాజీ యువక సంఘం, తీర్థం
5 రంగరాజ కృష్ణ, తీర్థం
6 వేమాల దేవేంద్ర చెట్టి, వి. కోట
7 శ్రీకంఠరావు, బెంగుళూరు
8 వి. నారాయణ రెడ్డి, కోలారు
9 ద్వాదశి వేంకట శివరామకృష్ణశాస్త్రి, లింగాల
10 పి. ఎస్. గోపాలకృష్ణ, మదరాసు
11 వృషభేంద్రాచార్, సొండూరు
12 పోతుకూచి విజయలక్ష్మి, పోలవరం
13 జూపూడి వెంకటేశ్వరరావు, రాజమండ్రి
14 యస్. మొహిద్దీన్, కోరుకొండ
15 టి. తాతబ్బాయి, పోలవరం

"కవిత్వం పుడుతుందా ఊరికే
కళ్లకు నోరొస్తే తప్ప."

—సి. నారాయణరెడ్డి

# చైతన్య కవితా వేదిక

అక్షయ శరత్తు **2** AUTUMN 1986

"పతాపితాప్రయోగించు పటుకఠోర కుఠారాలు"—శ్రీశ్రీ

డా. దివాకర్ల రాజేశ్వరి
ఆసురాజేంద్ర
గుంటూరు శేషేంద్ర శర్మ
జ్వాలాముఖి
పులికంటి కృష్ణారెడ్డి
బి. ప్రసేన్
ఎస్. మునిసుందరం
**డా. తంగిరాల సుబ్బారావు**
కీ. శే. దేవరకొండ బాలగంగాధర తిలక్
**ఆవంత్స సోమసుందర్**
ఆచార్య యస్వీ జోగారావు
వి. పి. చందన్‌రావు
డా. ఆర్వీయస్. సుందరం
"కరుణశ్రీ" జంధ్యాల పాపయ్య శాస్త్రి
కీ. శే. కొడాలి ఆంజనేయులు
ఆచార్య మాదిరాజు రంగారావు
డా. మిరియాల రామకృష్ణ
కె. గోదావరి శర్మ
కొల్లూరి
నిఖిలేశ్వర్
డా. దాశరథి
కీ. శే. దిగుమర్తి సీతారామస్వామి
కే ఎస్వీ
ఆర్. సీతారామారావు
ఏ. శ్రావణకుమార్
కందాళై రాఘవాచార్య
కోట్ల వెంకటేశ్వర రెడ్డి
కీ. శే. కొంపెల్ల జనార్దనరావు
టి. వి. కె. సోమయాజులు
ఆచార్య తుమ్మపూడి కోటీశ్వరరావు
ఆచార్య సరగు కృష్ణమూర్తి

రష్యన్, చైనా, ఆఫ్రికా, ఒరియా, పంజాబీ, కన్నడ కవితలు